ॐ

# పెద్ద బాలశిక్ష



ఏ దేశమేగినా ఎందుకాలిడిన
ఏ పీఠమెక్కినా ఎవ్వరేమనిన
పొగడరా నీతల్లి భూమిభారతిని
నిలుపరా నీ జాతి నిండు గౌరవము

Andhra-Telugu



## వినాయక ప్రార్థన

శుక్లాం బరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం ।
ప్రసన్న వదనం ధ్యాయేత్సర్వవిఘ్నోపశాన్తయే ॥

అగజానన పద్మార్కం గజానన మహర్నిశం ।
అనేక దన్తం భక్తానాం యేకదన్తముపాస్మహే ॥

## సరస్వతీ ప్రార్థన

సరస్వతీ నమస్తుభ్యం వరదే కామరూపిణీ ।
విద్యారంభం కరిష్యామి సిద్ధిర్భవతు మే సదా ॥

పద్మపత్రవిశాలాక్షీ పద్మకేసర వర్ణినీ ।
నిత్యం పద్మాలయా దేవీ సా మాం పాతు సరస్వతీ ॥

శరదిన్దువికాస మన్దహాసాం స్ఫుర దిన్దీవర లోచనాభిరామమ్ ।
ఆరవిన్దసమాన సున్దరాస్యా మరవిన్దాసనసున్దరీ ముపాసే ॥

శరణం కరవాణి శర్మదం తే చరణం వాణి చరాచరోపజీవ్యమ్ ।
కరుణామసృణైః కటాక్షపాతైః కురు మా మంబ కృతార్థసాధవాహమ్ ॥

శారదా శారదాంభోజవదనా వదనాంభుజే ।
సర్వదా సర్వదాఽస్మాకం సన్నిధి స్సన్నిధిం క్రియాత్ ॥

## గురు ప్రార్థన

గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః ।
గురుః సాక్షాత్పరబ్రహ్మా తస్మై శ్రీ గురవేనమః ॥

# శ్రీరస్తు

## తెనుఁగు ప్రథమాక్షరములు

# ఓ నమః శివా యః సిద్ధం నమః

తెలుగు అక్షరములు ౫౬

## అచ్చులు ౧౬

**అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఎ ఏ ఐ ఒ ఓ ఔ (అం అః)**

## హల్లులు ౩౭

క ఖ గ ఘ ఙ

చ ౘ ఛ జ ౙ ఝ ఞ

ట ఠ డ ఢ ణ

త థ ద ధ న

ప ఫ బ భ మ

య ర ల వ శ ష స హ ళ క్ష ఱ

## ఉభయాక్షరములు ౩

ం సున్న ఁ అరసున్న ః విసర్గ

## హిందీ అక్షరములు

# अ आ ई उ ऊ ऋ ऌ ॡ ए ऐ ओ औ अं अः

# क ख ग घ ङ

# च छ ज झ ञ

# ट ठ ड ढ ण

# त थ द ध न

# प फ ब भ म

# य र ल व श ष स ह ळ क्ष त्र ज्ञ

## ఆంగ్ల అక్షరములు

# A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

## అచ్చుల విభాగములు

| | |
|---|---|
| హ్రస్వములు ౭ | అ ఇ ఉ ఋ ఌ ఎ ఒ |
| దీర్ఘములు ౯ | ఆ ఈ ఊ ౠ ౡ ఏ ఐ ఓ ఔ |
| ప్లుతము ౧ | ౡ |
| వక్రతములు | ఎ ఏ ఒ ఓ |
| వక్రతమములు | ఐ ఔ |

## హల్లుల విభాగములు

| | |
|---|---|
| పరుషములు ౬ | క చ ౘ ట త ప |
| సరళములు ౬ | గ జ ౙ డ ద బ |
| ద్రుతము ౧ | న |
| స్థిరములు ౧౬ | ఖ ఘ ఙ ఛ ఝ ఞ ఠ ఢ ణ థ ధ న ఫ భ మ య ర ఱ ల ళ వ శ ష స హ క్ష |
| కేవలస్థిరములు ౧౪ | ఖ ఘ ఛ ఝ ఞ ఠ ఢ థ ధ ఫ భ ళ క్ష ఱ |
| అనునాశికములు ౫ | ఙ ఞ ణ న మ |
| అంతస్థములు ౬ | య ర ఱ ల ళ వ |
| ఊష్మములు ౪ | శ ష స హ |

| | కవర్గము | చవర్గము | టవర్గము | తవర్గము | పవర్గము |
|---|---|---|---|---|---|
| వర్గ ప్రథమములు | క | చ ౘ | ట | త | ప |
| వర్గ ద్వితీయములు | ఖ | ఛ | ఠ | థ | ఫ |
| వర్గ తృతీయములు | గ | జ ౙ | డ | ద | బ |
| వర్గ చతుర్థములు | ఘ | ఝ | ఢ | ధ | భ |
| వర్గ పంచమములు | ఙ | ఞ | ణ | న | మ |

ఈ ఇరువదియేడు స్పర్శములు

## వర్ణోత్పత్తి స్థానములు

| | |
|---|---|
| కంఠ్యములు | అ ఆ క ఖ గ ఘ ఙ హ ః |
| తాలవ్యములు | ఇ ఈ చ ఛ జ ఝ ఞ య శ |
| మూర్ధన్యములు | ఋ ౠ ట ఠ డ ఢ ణ ర ష ళ ఱ |
| దంత్యములు | ఌ ౡ త థ ద ధ న ల న చ జ |
| ఓష్ఠ్యములు | ఉ ఊ ప ఫ బ భ మ |
| అనునాశికములు | ఙ ఞ ణ న మ |
| కంఠతాలవ్యములు | ఎ ఏ ఐ |
| కంఠోష్ఠ్యములు | ఒ ఓ ఔ |
| దంతోష్ఠ్యములు | వ |
| నాశిక్యములు | ం ః |

## రెండు అక్షరముల పదములు

(అకారానుక్రమణిక)

| | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| అల | ఆశ | ఇల | ఈగ | ఉష | ఊడ | ఎద | ఏడ | ఐదు | ఔర | ఓడ | ఔర | అంచ | కథ | ఖర |
| గయ | ఘట | చల | ఛట | జడ | ఝంప | తల | దశ | ధర | నస | పర | ఫణ | బస | భళ | మఖ |
| యక్ష | రస | లయ | వల | శమ | సభ | హలం | క్షమ | | | | | | | |

## మూడు అక్షరముల పదములు

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| అలక | ఈవల | ఊయల | ఎడమ | కమల | గడప | చంపక | జనప | తగరం | నడక | పలక | భరణం | మరల |
| మడత | మమత | రమణ | లలన | వనజ | శకలం | సరళం | | | | | | |

## అచ్చులు హల్లులతో జేరునపుడు వచ్చు రూపభేదములు, వాని నామధేయములు

| | | | |
|---|---|---|---|
| ✓ | తలకట్టు | ౄ | సుడిదీర్ఘము |
| ా | దీర్ఘము | ె | ఎత్వము |
| ి | గుడి | ే | ఏత్వము |
| ీ | గుడిదీర్ఘము | ై | ఐత్వము |
| ు | కొమ్ము | ొ | ఒత్వము |
| ూ | కొమ్ముదీర్ఘము | ో | ఓత్వము |
| ృ | సుడి | ౌ | ఔత్వము |

## హల్లులు హల్లులతో జేరునపుడు వచ్చు రూపభేదములు, వాని నామధేయములు

| | | | |
|---|---|---|---|
| ్క | కావత్తు | ్ర | క్రారావడి |
| ్త | తావత్తు | ్ర | వలపలగిలక |
| ్న | నావత్తు | ్ల | లావత్తు |
| ్మ | మావత్తు | ్వ | వావత్తు |
| ్ష | కియావడి | ౝ | నకారపొల్లు |

తక్కిన 30 హల్లులు హల్లులతోఁ జేరునపుడు రూపభేదములు లేవు.

## హల్లులతో రూపభేదములుగల అచ్చులను జేర్చి పలికెడు గుణితము

| | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| క | కా | కి | కీ | కు | కూ | కృ | కౄ | కె | కే | కై | కొ | కో | కౌ | కం | కః |
| ఖ | ఖా | ఖి | ఖీ | ఖు | ఖూ | ఖృ | ఖౄ | ఖె | ఖే | ఖై | ఖొ | ఖో | ఖౌ | ఖం | ఖః |
| గ | గా | గి | గీ | గు | గూ | గృ | గౄ | గె | గే | గై | గొ | గో | గౌ | గం | గః |
| ఘ | ఘా | ఘి | ఘీ | ఘు | ఘూ | ఘృ | ఘౄ | ఘె | ఘే | ఘై | ఘొ | ఘో | ఘౌ | ఘం | ఘః |
| ఙ | ఙా | ఙి | ఙీ | ఙు | ఙూ | ఙృ | ఙౄ | ఙె | ఙే | ఙై | ఙొ | ఙో | ఙౌ | ఙం | ఙః |
| చ | చౄ | చి | చీ | చు | చూ | చృ | చౄ | చె | చే | చై | చొ | చో | చౌ | చం | చః |
| ఛ | ఛా | ఛి | ఛీ | ఛు | ఛూ | ఛృ | ఛౄ | ఛె | ఛే | ఛై | ఛొ | ఛో | ఛౌ | ఛం | ఛః |
| జ | జా | జి | జీ | జు | జూ | జృ | జౄ | జె | జే | జై | జొ | జో | జౌ | జం | జః |
| ఝ | ఝా | ఝి | ఝీ | ఝు | ఝూ | ఝృ | ఝౄ | ఝె | ఝే | ఝై | ఝొ | ఝో | ఝౌ | ఝం | ఝః |
| ఞ | ఞా | ఞి | ఞీ | ఞు | ఞూ | ఞృ | ఞౄ | ఞె | ఞే | ఞై | ఞొ | ఞో | ఞౌ | ఞం | ఞః |
| ట | టా | టి | టీ | టు | టూ | టృ | టౄ | టె | టే | టై | టొ | టో | టౌ | టం | టః |
| ఠ | ఠా | ఠి | ఠీ | ఠు | ఠూ | ఠృ | ఠౄ | ఠె | ఠే | ఠై | ఠొ | ఠో | ఠౌ | ఠం | ఠః |
| డ | డా | డి | డీ | డు | డూ | డృ | డౄ | డె | డే | డై | డొ | డో | డౌ | డం | డః |
| ఢ | ఢా | ఢి | ఢీ | ఢు | ఢూ | ఢృ | ఢౄ | ఢె | ఢే | ఢై | ఢొ | ఢో | ఢౌ | ఢం | ఢః |
| ణ | ణా | ణి | ణీ | ణు | ణూ | ణృ | ణౄ | ణె | ణే | ణై | ణొ | ణో | ణౌ | ణం | ణః |
| త | తా | తి | తీ | తు | తూ | తృ | తౄ | తె | తే | తై | తొ | తో | తౌ | తం | తః |
| థ | థా | థి | థీ | థు | థూ | థృ | థౄ | థె | థే | థై | థొ | థో | థౌ | థం | థః |
| ద | దా | ది | దీ | దు | దూ | దృ | దౄ | దె | దే | దై | దొ | దో | దౌ | దం | దః |
| ధ | ధా | ధి | ధీ | ధు | ధూ | ధృ | ధౄ | ధె | ధే | ధై | ధొ | ధో | ధౌ | ధం | ధః |
| న | నా | ని | నీ | ను | నూ | నృ | నౄ | నె | నే | నై | నొ | నో | నౌ | నం | నః |
| ప | పా | పి | పీ | పు | పూ | పృ | పౄ | పె | పే | పై | పొ | పో | పౌ | పం | పః |
| ఫ | ఫా | ఫి | ఫీ | ఫు | ఫూ | ఫృ | ఫౄ | ఫె | ఫే | ఫై | ఫొ | ఫో | ఫౌ | ఫం | ఫః |
| బ | బా | బి | బీ | బు | బూ | బృ | బౄ | బె | బే | బై | బొ | బో | బౌ | బం | బః |
| భ | భా | భి | భీ | భు | భూ | భృ | భౄ | భె | భే | భై | భొ | భో | భౌ | భం | భః |
| మ | మా | మి | మీ | ము | మూ | మృ | మౄ | మె | మే | మై | మొ | మో | మౌ | మం | మః |
| య | యా | యి | యీ | యు | యూ | యృ | యౄ | యె | యే | యై | యొ | యో | యౌ | యం | యః |
| ర | రా | రి | రీ | రు | రూ | రృ | రౄ | రె | రే | రై | రొ | రో | రౌ | రం | రః |
| ల | లా | లి | లీ | లు | లూ | లృ | లౄ | లె | లే | లై | లొ | లో | లౌ | లం | లః |
| వ | వా | వి | వీ | వు | వూ | వృ | వౄ | వె | వే | వై | వొ | వో | వౌ | వం | వః |

| | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| శ | శా | శి | శీ | శు | శూ | శృ | శౄ | శె | శే | శై | శొ | శో | శౌ | శం | శః |
| ష | షా | షి | షీ | షు | షూ | షృ | షౄ | షె | షే | షై | షొ | షో | షౌ | షం | షః |
| స | సా | సి | సీ | సు | సూ | సృ | సౄ | సె | సే | సై | సొ | సో | సౌ | సం | సః |
| హ | హా | హి | హీ | హు | హూ | హృ | హౄ | హె | హే | హై | హొ | హో | హౌ | హం | హః |
| ళ | ళా | ళి | ళీ | ళు | ళూ | ళృ | ళౄ | ళె | ళే | ళై | ళొ | ళో | ళౌ | ళం | ళః |
| క్ష | క్షా | క్షి | క్షీ | క్షు | క్షూ | క్షృ | క్షౄ | క్షె | క్షే | క్షై | క్షొ | క్షో | క్షౌ | క్షం | క్షః |
| ఱ | ఱా | ఱి | ఱీ | ఱు | ఱూ | ఱృ | ఱౄ | ఱె | ఱే | ఱై | ఱొ | ఱో | ఱౌ | ఱం | ఱః |

## హల్లులతో రూపభేదములుగల హల్లులను జేర్చి పలికెడు గుణితము

| | | | | | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| క్క | ఖ్క | గ్క | ఘ్క | ఙ్క | చ్క | ఛ్క | జ్క | జ్క | ఝ్క | ఞ్క | ట్క | ఠ్క | డ్క | ఢ్క | ణ్క | త్క | థ్క | ద్క | ధ్క |
| న్క | ప్క | ఫ్క | బ్క | భ్క | మ్క | య్క | ర్క | ల్క | వ్క | శ్క | ష్క | స్క | హ్క | ళ్క | క్ష్క | ఱ్క | | | |

| | | | | | | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| క్త | ఖ్త | గ్త | ఘ్త | ఙ్త | చ్త | ఛ | జ్త | జ్త | ఝ్త | ఞ్త | ట్త | ఠ్త | డ్త | ఢ్‌త | ణ్త | త్త | థ్త | ద్త | ధ్త | న్త |
| ప్త | ఫ్త | బ్త | భ్త | మ్త | య్త | ర్త | ల్త | వ్త | శ్త | ష్త | స్త | హ్త | ళ్త | క్ష్త | ఱ్త | | | | | |

| | | | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| క్న | ఖ్న | గ్న | ఘ్న | ఙ్న | చ్న | ఛ్న | జ్న | జ్న | ఝ్న | ఞ్న | ట్న | ఠ్న | డ్న | ఢ్న | ణ్న | త్న | థ్న |
| ద్న | ధ్న | న్నప్న | ఫ్న | బ్న | భ్న | మ్న | య్న | ర్న | ల్న | వ్న | శ్న | ష్న | స్న | హ్న | ళ్న | క్ష్న | ఱ్న |

| | | | | | | | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| క్మ | ఖ్మ | గ్మ | ఘ్మ | ఙ్మ | చ్మ | ఛ్మ | జ్మ | జ్మ | ఝ్మ | ఞ్మ | ట్మ | ఠ్మ | డ్మ | ఢ్మ | ణ్మ | త్మ | థ్మ | ద్మ | ధ్మ | న్మ | ప్మ |
| ఫ్మ | బ్మ | భ్మ | మ్మ | య్మ | ర్మ | ల్మ | వ్మ | శ్మ | ష్మ | స్మ | హ్మ | ళ్మ | క్ష్మ | ఱ్మ | | | | | | | |

| | | | | | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| క్య | ఖ్య | గ్య | ఘ్య | ఙ్య | చ్య | ఛ్య | జ్య | జ్య | ఝ్య | ఞ్య | ట్య | ఠ్య | డ్య | ఢ్య | ణ్య | త్య | థ్య | ద్య | ధ్య |
| న్య | ప్య | ఫ్య | బ్య | భ్య | మ్య | య్‌య | ర్య | ల్య | వ్య | శ్య | ష్య | స్య | హ్య | ళ్య | క్ష్య | ఱ్య | | | |

| | | | | | | | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| క్ర | ఖ్ర | గ్ర | ఘ్ర | ఙ్ర | చ్ర | ఛ్ర | జ్ర | జ్ర | ఝ్ర | ఞ్ర | ట్ర | ఠ్ర | డ్ర | ఢ్ర | ణ్ర | త్ర | థ్ర | ద్ర | ధ్ర | న్ర | ప్ర |
| ఫ్ర | బ్ర | భ్ర | మ్ర | య్ర | ర్ర | ల్ర | వ్ర | శ్ర | ష్ర | స్ర | హ్ర | ళ్ర | క్ష్ర | ఱ్ర | | | | | | | |

| | | | | | | | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| క్ల | ఖ్ల | గ్ల | ఘ్ల | ఙ్ల | చ్ల | ఛ్ల | జ్ల | జ్ల | ఝ్ల | ఞ్ల | ట్ల | ఠ్ల | డ్‌ల | ఢ్ల | ణ్ల | త్ల | థ్ల | ద్ల | ధ్ల | న్ల | ప్ల |
| ఫ్ల | బ్ల | భ్ల | మ్ల | య్ల | ర్ల | ల్ల | వ్ల | శ్ల | ష్ల | స్ల | హ్ల | ళ్ల | క్ష్ల | ఱ్ల | | | | | | | |

| | | | | | | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| క్వ | ఖ్వ | గ్వ | ఘ్వ | ఙ్వ | చ్వ | ఛ్వ | జ్వ | జ్వ | ఝ్వ | ఞ్వ | ట్వ | ఠ్వ | డ్వ | ఢ్వ | ణ్వ | త్వ | థ్వ | ద్వ | ధ్వ | న్వ |
| ప్వ | ఫ్వ | బ్వ | భ్వ | మ్వ | య్వ | ర్వ | ల్వ | వ్వ | శ్వ | ష్వ | స్వ | హ్వ | ళ్వ | క్ష్వ | ఱ్వ | | | | | |

| | | | | | | | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| క్ | ఖ్ | గ్ | ఘ్ | ఙ్ | చ్ | ఛ్ | జ్ | ఝ్ | ఞ్ | ట్ | ఠ్ | డ్ | ఢ్ | ణ్ | త్ | థ్ | ద్ | ధ్ | న్ | ప్ | ఫ్ |
| బ్ | భ్ | మ్ | య్ | ర్ | ల్ | వ్ | శ్ | ష్ | స్ | హ్ | ళ్ | క్ష్ | ఱ్ | | | | | | | | |

| | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| కఁ | ఖఁ | గఁ | ఘఁ | ఙఁ | చఁ | ఛఁ | జఁ | జఁ | ఝఁ | ఞఁ | టఁ | ఠఁ | డఁ | ఢఁ |
| ణఁ | తఁ | థఁ | దఁ | ధఁ | నఁ | పఁ | ఫఁ | బఁ | భఁ | మఁ | యఁ | రఁ | లఁ | వఁ |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| శౄ | షౄ | సౄ | హౄ | ళౄ | క్షౄ | ఱౄ |

## మూడు హల్లులపై అచ్చుగలియుట

| | | | | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స్థ్య | త్థ్య | ప్త్య | గ్భ్రి | ర్ఘ్ణ | ర్గ్గ | స్ల్క | ర్ధ్వ | క్త్య | త్మ్య | క్ష | క్చ | క్ఛ | క్ట | క్ఠ | క్డ | క్ఢ | క్ణ | క్థ |
| క్ధ | క్ప | క్ఫ | క్శ | క్స | క్ష | గ్గ | గ్ఘ | గ్జ | గ్ఝ | గ్డ | గ్ఢ | గ్ణ | గ్ధ | గ్ఠ | గ్బ | గ్భ | గ్హ | |

ఇట్టెల్లయక్షరంబులు వక్ష్యమాణ సూత్రోక్త క్రమంబున నూహించునది

## రెండు అక్షరముల పేర్లు

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| అమ్మ | ఆవు | ఇల్లు | ఈగ | ఉలి | ఊరు | ఋణం | ఎంత | ఏల | ఐదు | ఒర | ఓడ |
| ఔర | అందె | కల | కాకి | కిల | కీలు | కుడి | కూత | కృప | కెంత | కేక | కైక |
| కొన | కోతి | కౌలు | కంకి | ఖల | ఖారి | ఖేల | ఖైదు | గది | గాలి | గిరి | గీత |
| గుడి | గూబ | గృహి | గెల | గేదె | గొబ్బి | గోవు | గౌరి | గంప | ఘంట | ఘాత | ఘృణి |
| ఘోణ | చలి | చాప | చింత | చీమ | చుక్క | చూరు | చెవి | చేను | చొక్కా | చోటు | చౌక |
| చంక | ఛత్రం | ఛాయ | జపం | జాజి | జిడ్డు | జీఱ | జున్ను | జూలు | జృంభ | జేత | జొన్న |
| జోల | జంట | ఝషం | ఝూరి | టపా | టాకు | టీక | టూకి | టేకు | టోకు | ఠవ | ఠావు |
| ఠీవి | ఠేవ | డబ్బా | డాగు | డీలా | డెక్క | డేగ | డొంక | డోలు | డంబం | ఢాక | ఢంక |
| తల | తాత | తిక్క | తీగ | తుద | తూలు | తృష్ణ | తెర | తేమ | తైలం | తొడ | తోట |
| తౌడు | తంతి | దయ | దాత | దిక్కు | దీవి | దులి | దూత | దృష్టి | దెబ్బ | దేవి | దైవం |
| దొప్ప | దోమ | దౌడు | దండ | ధర్మం | ధార | ధువి | ధూళి | ధృతి | ధైర్యం | నల్లి | నాచు |
| నిన్న | నీతి | నుయ్యి | నూపు | నెల | నేడు | నొస | నోరు | నౌక | నంది | పప్పు | పాప |
| పిడి | పీట | పులి | పూవు | పెద్ద | పేరు | పైడి | పొగ | పోక | పండు | ఫణి | ఫాల |
| బడి | బావ | బిగి | బీడు | బుగ్గ | బూది | బేల | బైరి | బొగ్గు | బోను | బంక | భట్టు |
| భాష | భిక్ష | భీతి | భువి | భూమి | భృతి | భేరి | భోగి | మతి | మామ | మితి | మీను |
| ముడి | మూత | మృత | మెడ | మేక | మైల | మొన | మోత | మౌని | మంద | యతి | యాత్ర |
| యుక్తి | యూపం | యోగి | యంత్రం | రవి | రాజు | రీతి | రూఢి | రెక్క | రేగు | రైతు | రొమ్ము |
| రోగి | రౌతు | రంగు | లక్క | లాలి | లిప్త | లీఖి | లూత | లెక్క | లేత | లొట్ట | లోతు |
| లంక | వస | వాన | విల్లు | వీపు | వృథ | వెల | వేడి | వైరి | వంక | సజ్జ | సాన |
| సిరి | సీమ | సుడి | సూది | సృష్టి | సెర | సేను | సైగ | సొర | సోగ | సౌరు | సంధి |
| శకం | శాఖ | శిల | శీత | శుచి | శూలి | శెట్టి | శేరు | శైలి | శోషి | శౌరి | శంక |
| క్షయ | క్షారం | క్షీరం | క్షుధ | ఱాయి | | | | | | | |

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| అక్క | ఆమె | ఇది | ఈమె | ఉట్టి | ఊరు | ఋషి | ఎండ | ఏటు | ఐదు | ఒట్టు | ఓర్పు |
| ఔర | అంచ | కన్ను | కాలు | కీటి | కీర్తి | కృప | కుక్క | కూడు | కైపు | కొన | కోరు |
| కౌలు | ఖరం | ఖాళి | ఖిన్ను | గడ్డి | గాది | గిడ్డు | గీటు | గుంజ | గూడు | గెట్టి | గేలి |
| గొడ్డు | గోచి | గౌళి | ఘంట | ఘాతీ | ఘృషి | చర్చ | చాప | చిక్కు | చీరు | చీమ | చుట్టం |
| చూపు | చెట్టు | చేష్ట | చొంగ | చందం | జమ | జాలి | జిల | జీడి | జుట్టు | జూదం | జోరు |
| జంగం | టక్కు | టీకు | టెంక | డబ్బు | డాబు | డులి | డెక్క | డేకు | ఢక్క | తల | తాడు |
| తిత్తి | తీపు | తుద | తూకు | తెచ్చు | తేలు | తొడ | తోలు | తండా | దగా | దారి | దిక్కు |
| దీపం | దుత్త | దూడ | దృష్టి | దెబ్బ | దేవి | దొంగ | దోయి | ధర | ధాత | ధూళి | ధేను |
| ధైర్యం | నక్క | నాడు | నిండ | నీతి | నూగు | నృప | నెత్తి | నేను | నొప్పి | నోము | పంట |
| పాలు | పిండి | పీట | పుంజు | పూజ | పెండ్లి | పేను | పైరు | పొడి | పోళి | పౌత్రి | పందెం |
| ఫలం | ఫింఛం | ఫృథ్వి | బంగి | బాగు | బిడ్డ | బీద | బుఖ్ఖు | బూజు | బెండు | బేసి | బైట |
| బొట్టు | బోణి | బండి | భట్టు | భార్య | భుక్తి | భూతి | భృతి | భ్రాత | భైరి | మంత్రి | మాట |
| మిలి | మీదు | ముడి | మూర | మెల్లి | మేడ | మైదు | మొగ్గ | మోడి | మంట | యష్టి | యోగి |
| రచ్చ | రాగి | రిమ్మ | రీఢ | రుచి | రూక | రెప్ప | రేకు | రొట్టె | రోలు | రౌతు | రంధ్రం |
| లక్ష్మి | లాలి | లిబ్బి | లీల | లుబ్ధు | లూటి | లెస్స | లేక | లొంగు | లోభి | లౌక్యం | లంకె |
| వంకి | వాలు | విందు | వీణ | వృద్ధి | వెండి | వేట | వైరి | వంట | శతం | శాతం | శిరా |
| శీమ | శుద్ధి | శూల | శ్రేణి | శోభ | శౌరి | షష్టి | సందు | సాక్షి | సిగ్గు | సీత | సుడి |
| సూరి | సెట్టి | సేద్యం | సొన | సోగ | సంధ్య | హస్త | హోయి | హితం | హేమం | క్షమ | |

## మూడు అక్షరముల పేర్లు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| అప్పము | ఆకులు | ఇగురు | ఈతడు | ఉడుము | ఊయల | ఋతువు | ఎలుక | ఏకము | ఐక్యము |
| ఒక్కండు | ఓర్పరి | ఔరౌర | అంగడి | కట్నము | కానుక | కిసరు | కీనీడ | కుడుము | కూకలు |
| కృత్తిక | కెంపులు | కేళిక | కైవడి | కొండెము | కోడేలు | ఖడ్గము | ఖిన్నుడు | ఖేదము | గడువు |
| గానము | గిలుక | గీతము | గుడారు | గూటము | గృహము | గెడలు | గేదంగి | గొంగళి | గోరులు |
| గౌతమి | గండకి | ఘనము | ఘృతము | ఘోషము | చలము | చాపము | చిగురు | చీమిడి | చుట్టము |
| చూర్ణము | చెక్కులు | చేమంతి | చైత్రము | చొక్కడి | చోరుడు | చౌకము | ఛత్రము | ఛేదించి | జగము |
| జాతర | జిగురు | జీతము | జుత్తెడు | జూదము | జేజేలు | జోగొట్టు | జంతువు | ఝషము | టెంకాయ |
| టంకము | శవర | డబ్బులు | డాపల | డిగియ | డెబ్బది | డంబము | తపము | తాకట్టు | తియ్యన |
| తీరిక | తుడుము | తూరుపు | తృణము | తెలుపు | తేగము | తొండము | తోరము | దర్పము | దానము |

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| దినము | దీనుడు | దుర్గము | దూషణ | దృఢము | దేవర | దైవము | దొంతర | దోరము | దౌత్యము |
| దంతము | ధనము | ధాన్యము | ధీరుడు | ధూపము | ధేనువు | ధైర్యము | ధోరణి | నగరు | నాలుక |
| నిజము | నీరుల్లి | నుదురు | నృత్యము | నెమలి | నేరేడు | నొసలు | పగలు | పాపము | పిడక |
| పీనస | పుష్యమి | పూజ్యము | పృథివి | పెదవి | పేలాలు | పైకము | పొలము | పోలిక | పండుగ |
| ఫలము | ఫాలము | ఫింఛము | బల్లెము | బాడుగ | బిచ్చము | బీరము | బురుద | బూడిదె | బెజ్జము |
| బేరము | బైరాగి | బొబ్బలు | బోగుణి | బంజరు | భద్రము | భాగ్యము | భిన్నము | భీముడు | భుజము |
| భూతము | భేదము | భోగము | మనస్సు | మాటలు | మిడత | మీగడ | ముంగిస | మెంతులు | మేనక |
| మొండెము | మోకాలు | మౌనము | మంత్రము | | | | | | |

## నాలుగు అక్షరముల పేర్లు

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| అపరంజి | ఆటకాఁడు | ఇంగితము | ఈతగాఁడు | ఉదరము | ఊడిగము | ఋణస్థుడు | ఎగతాళి |
| ఏకాంతము | ఐహిత్యము | ఒక్కప్రొద్దు | ఓటికుండ | ఔషధము | కట్టదండ | కాగితము | కిరీటము |
| కీలుకత్తి | కుందనము | కూలివాఁడు | కైలాసము | కొండెగాఁడు | కోడెదూడ | కౌపీనము | కందకము |
| ఖర్జూరము | గబ్బిలము | గాయకుడు | గుద్దులాట | గూనివాఁడు | గృహలక్ష్మి | గెలిపించు | గొంటొపోక |
| గోలకొండ | ఘటికుడు | ఘాతకుడు | ఘీంకారము | చదరము | చామరము | చిగురాకు | చీరపేను |
| చుక్కబొట్టు | చూరుకొమ్మ | చెంగలువ | చేమగడ్డ | చందురుడు | జగడము | జాగరము | జిత్తులాడి |
| జీవనము | జున్నుపాలు | జెట్టిపోతు | జొన్నకూడు | జోలపాట | ఝాముప్రొద్దు | ఝుంకారము | డగ్గుత్తిక |
| డాంభికులు | డీలాపడు | తలకట్టు | తామసము | తిండిపోతు | తీపిమాట | తురగము | తూకుమాను |
| తెల్లవారి | తేటమాట | తేజోవతి | తోరణము | దరిద్రము | దారిద్ర్యము | దివిటీలు | దీవనము |
| దుగులము | దూషణము | దృష్టాంతము | దెప్పరము | దేవలము | దొంగసొమ్ము | దోరణము | దౌర్భాగ్యము |
| దంతములు | ధవళము | ధారాళము | ధిక్కరింపు | ధూమకేతు | నక్షత్రము | నారదుడు | నిమ్మకాయ |
| నీరుపట్టు | నూలుపోగు | నూపురము | నృపాలుడు | నెల్లిచెట్టు | నేరుపరి | నైవేద్యము | నంగనాచి |
| పగడము | పావురము | పిన్నతల్లి | పుచ్చకాయ | పూలబంతి | పెద్దవాఁడు | పేరంటము | పైగస్తీలు |
| పొరబాటు | పోరాటము | పౌరుషము | పండితుడు | ఫణిరాజు | బలపము | బాలసారె | బిడియము |
| బీరకాయ | బుర్రుపిట్ట | బూరగొమ్మ | బృహస్పతి | బెండకాయ | బేరగాఁడు | బొంగరము | బోయవాఁడు |
| భరణము | భాగహారి | భిక్షకుడు | భీకరము | భువనము | భూతదయ | భౌతికము | భంగపాటు |
| మకరము | మార్జాలము | మిరయము | మీసకట్టు | మూషికము | మృదుత్వము | మెట్టుపంట | మేనమామ |
| మైదానము | మొండిపట్టు | మోదకము | మందిరము | యథాశక్తి | యాత్రికులు | యువకుడు | యోజనము |
| యౌవనము | రమారమి | రాతినేల | రూపవతి | రెప్పపాటు | రేచీకటి | రైతుబిడ్డ | రొక్కములు |
| రోటిబండి | లక్కయిల్లు | లాలనము | లేగదూడ | లోకసాక్షి | లౌకికము | లంఖణము | వర్తకుడు |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| వాహనము | వివరణ | వీరత్వము | వృష్టిదాత | వెతనొందు | వేగిరము | వైశాల్యము | వంగతోట |
| శయనము | శాసనము | శిఖరము | శీలవతి | శునకము | శూద్రకుడు | శైలరాజు | శొంఠిపొడి |
| శంకరుడు | సరస్వతి | సాహిత్యము | హరిదాసు | హృదయము | క్షణికము | క్షాళనము | క్షీరాన్నము |
| క్షౌరశాల | క్షంతవ్యుడు | | | | | | |

## నీతి వాక్యములు

| | | | | |
|---|---|---|---|---|
| అవనిదపము మేలు<br>అరయదనముపాలు | ఆశలెస్స గెలుపు<br>ఆజ్ఞయందు నిలుపు | ఇంపుమాటలాడు<br>ఇచ్చి కీర్తివేడు | ఈవిజెరచనోడు<br>ఈడువాఁనిగూడు | ఉన్నచోటనుండు<br>ఉత్తమాట మెండు |
| ఊరగలసి మనుము<br>ఊనిపనుల గనుము | ఎగ్గుదలచ వద్దు<br>ఎపుడు విందు ముద్దు | ఏరి వియ్యమందు<br>ఏకరీతి నొందు | ఐనవారి జేరు<br>ఐదుగురుల గోరు | ఒరుల కార్యమాను<br>ఒప్పుచాలబూను |
| ఓటుమాటవిడుపు<br>ఓర్పుమించి నడుపు | ఔరకొరులసొమ్ము<br>ఔనని పనియెంచు | కల్లమాట వినకు<br>కన్నచోట జనకు | గట్టిమాటనుడువు<br>గర్వమంత విడువు | చెప్పుకొనకుయిచ్చి<br>చెప్పకేల గుచ్చి |
| చొచ్చి వీగరాదు<br>చొరవలేనివాఁడు | జాగరూకుడనుము<br>జాల్మొడనక తగుము | జౌరకొరుల సొమ్ము<br>జౌకుపదము కమ్ము | టక్కులేమి జేయకు<br>టక్కువానిడాయకు | డబ్బులెస్సగెలువు<br>డంభమెప్పనడువు |
| తరనిబైరుబెట్టు<br>తపముబోగబట్టు | దబ్బరాటపాటు<br>దయనువిడువదేటు | నయము తప్పవద్దు<br>నడత మంచి పద్దు | పాపబుద్ధికలదు<br>పాముచెలిమిజెరచు | బాసలాడబోకు<br>బాలుజాడరాకు |
| మనవి వినుట యొప్పు<br>మమత విడమి తప్పు | యతుల నింద జెరచు<br>యాచ్నభంగపరచు | రమణి మాయపడక<br>రిపుల చేరి చెడక | లాభమూనిగూర్చు<br>లోభముడుగదీర్చు | వచనమొకటి కలదు<br>వాదుకెపుడు నలుకు |
| శిక్షవంక తొలగు<br>సఖుల కీడు బాపు | | | | |

## ప్రాస వాక్యములు

| | | | | |
|---|---|---|---|---|
| దేవదేవరమ్మ<br>కావుమయ్యమమ్మ | రూకలేనివాఁడు<br>పోకజేయలేడు | ఎక్కువైన బుద్ధి<br>పెక్కు కార్యసిద్ధి | పొడుగు నడతబూను<br>యిడుము నడచిపోను | స్వామి పాదసేవ<br>క్షేమమంత త్రోవ |
| నొచ్చిధనములందు<br>ఇచ్చి యశమునొందు | మంచి విద్య చదువు<br>మంచి బుద్ధిలొదవు | రాచవాని విందు<br>మాచికొమ్మ పొందు | రాజులేనియూళ్ళు<br>పూజలేని గుళ్ళు | రాజుకొలువుతోటి<br>రాజుగిన్నెసాటి |
| కట్టులేని నోరు<br>కట్టుతెగిన యేరు | ఒట్టివాని మాట<br>గట్టినీళ్ళమూట | కొంటెశిరులనీటు<br>కుంటివానిదాటు | యిడనిలోభిప్రేత<br>పుడమినతడు మ్రోత | అడుసుదొక్కనేల<br>అడుగుగడుగనేల |
| గుణమెలెన్నియున్న<br>తృణముపేదలన్న | నీతిలేనివాఁడు<br>కోతికంటెబీడు | సతినిబొందు మెలగు<br>సుతులబొంది చెలగు | చదువులేని మొద్దు<br>కదలలేని యెద్దు | మొదటయింట గెలుపు<br>పిదప రచ్చ గెలుపు |

| | | | | |
|---|---|---|---|---|
| పెద్దలయందు భక్తి<br>ముద్దుగుల్కుముక్తి | ధనములెస్సవారు<br>వినయమెపుగుగోరు | గొప్పవాని పట్టు<br>ఒప్పవేల్పుగట్టు | ఇంపువేల్పు కొలువు<br>సొంపు సిరులసలుపు | అబ్బలేని బిడ్డ<br>మబ్బులేని యెండ |
| ప్రియములేని విందు<br>నయముగాని మందు | వరవుమించి సెలవు<br>వరవుకెచ్చు బరువు | నారిలేని యిల్లు<br>నావిలేని విల్లు | తులువతోటి చెలిమి<br>చిలుకకాటి కలిమి | వేల్పుమీద రక్తి<br>సల్పులెస్సముక్తి |
| కవితలేని నోళ్ళు<br>చవియలేని కూళ్ళు | బాసలాడువాఁడు<br>కాసుచేయలేడు | విహితమెపుడుజేయు<br>అహితమెపుడు బాపు | నీతివాక్యమాల<br>నీతితోడబాల | |

## సద్బుద్ధి శబ్దములు

| | |
|---|---|
| అంకె తప్పు వేయవద్దు | అడ్డమాటచెప్పవద్దు |
| అన్నమాట తప్పవద్దు | అప్పుచేయ వద్దు |
| అపకారము చేసిన వారికినుపకారము చేయవలెను | ఆడితప్పబోకు |
| ఆకలిగొన్నవారికి అన్నము పెట్టవలెను | ఈతకొట్టవద్దు |
| ఋణశేషం శత్రుశేషములుంచరాదు | ఒకరిమీద చాడీలు చెప్పరాదు |
| ఓర్చలేని తనము విడువవలెను | కష్టపడ్డవానికి సుఖము కద్దు |
| కలనైన బొంకవద్దు | కీడుకోరవద్దు |
| కీర్తి పొందగోరు | కృతిచేత కీర్తినొందు |
| కొంటెచేష్టమాను | కొండెముజెప్పవానితో |
| పగచేసుకొనరాదు | కోటివరహాలు వచ్చినా హీనునుగొలువరాదు |
| గర్వపడవద్దు | గురుభక్తిచాలవుంచు |
| గురువు చెప్పిన మాట నమ్మవలెను | చదువుకొనెడు కాలం వ్యర్థపుచ్చరాదు |
| చాడిచెప్పరాదు | చింతన చెయ్యని విద్య పనికి రాదు |
| చెడు గుణము విడచిపెట్టు | చెడుపని చేయవలదు |
| చెడ్డచోటు విడువు | చెప్పి లేదనవలదు |
| చేతిపని నిలుపవలదు | చౌకగా కొనుము |
| జనులు నిందింప దగిన పని చేయవలదు | జీవహింస చేయవలదు |
| తడిబట్ట కట్టరాదు | తనకు చదువువచ్చునని చాల గర్వపడరాదు |
| తనకు పగవాడైనను కీడు తలపరాదు | తన కోపమె తన్ను చంపును |
| తనగుట్టు బైటవేయరాదు | తన మరుగుజొచ్చినవానిని రక్షింపవలెను |
| తనయూరివారితో పగ జేయరాదు | తన్ను తాను పొగుడుకొనరాదు |
| తప్పు సత్యము చేయరాదు | తల్లిదండ్రులను కష్టబెట్టరాదు |

| | |
|---|---|
| తల్లిదండ్రుల మాట విను | తంట మాట చెప్పవలదు |
| ధరచూచి కొనగోరు | దేవుని నిందించవలదు |
| దొంగతో స్నేహము చేయరాదు | దొంగసొమ్ము కొనవద్దు |
| ధర్మచింత మానవలదు | నమ్మిన వారిని చెరుపరాదు |
| పగవాడువచ్చి శరణు జేసిన కాపాడవలెను | పఙ్క్తి భేదము చేయరాదు |
| పచ్చికాయ గిల్లవద్దు | పదిమంది వద్దనిన పని చేయరాదు |
| పరులసొమ్ము కోరవద్దు | పాపము జేయవద్దు |
| పెద్దలపాటలు వినవలెను | పేదలమీద దయవుంచవలెను |
| ప్రజ్ఞమాట చెప్పుకొనవద్దు | పరనింద చేయరాదు |
| ప్రభుదయనమ్మి గర్వపడరాదు | మాయ చేయబోకు |
| మంచిగుణము విడువవద్దు | మంచిచోటుజేరు |
| మంచిపాలుత్రాగు | మందుకు తగిన పత్యముజేయవలెను |
| యతినిదజేయవలదు | యోగ్యత తెలిసి స్నేహము చేయవలెను |
| రాజద్రోహము జేయరాదు | రుచియని చాల తినరాదు |
| రోగిమీద దూరవలదు | లేమివచ్చెనని విచారపడరాదు |
| లోతుచూడ నీళ్ళబోవలదు | విద్య యెంత వచ్చినను చాలునని చెప్పరాదు |
| విద్యచెప్పినవారిని మరువవలదు | వితమాట వినగోరు వేళకు తగినట్లు నడుచుకోవలెను |
| వ్రాయజదువ నేర్చినవాడు సుఖపడును | శుచిగా నుండగోరు |
| సభలో నవ్వరాదు | సభలో సిగ్గుపడరాదు |
| సాధ్యముకాని పనికి పూనరాదు | స్వామియందు భక్తియుంచు |
| స్నేహముగలచోట అప్పుతీయరాదు | హింసచేయ బూనరాదు |
| మంచిపని చేయవలెను | |

## ఆరు స్వరములకు మించని రూఢీ వాచకశబ్దములు

### పురుషవాచక శబ్దములు

| | |
|---|---|
| హరిశ్చంద్రుడు | ఇక్ష్వాకువంశపు రాజు, సత్యము పలికేవాడు. |
| ధర్మరాజు | పాండురాజుయొక్క జ్యేష్ఠపుత్రుడు, ధర్మాత్ముడు. |
| కర్ణుడు | ధర్మరాజుని సహోదరుడు, మహాదాత. |
| భీముడు | ధర్మరాజుని తమ్ముడు, అతి బలశాలి. |
| కంసుడు | ఉగ్రసేనుని కుమారుడు, అతి దుర్మార్గము గలవాడు. |
| మన్మథుడు | కృష్ణుని కుమారుడు, మంచి రూపము గలవాడు. |
| కుబేరుడు | ఉత్తరదిక్కధిపతి, అతి ధనశాలి. |
| బృహస్పతి | దేవగురువు, మిక్కిలి బుద్ధిమంతుడు. |
| బలి చక్రవర్తి | మహాబలవంతుడు, మహాదాత. |
| అర్జునుడు | ధర్మరాజుని సహోదరుడు, యుద్ధరంగమందు అపజయముగలుగనివాడు. |
| మారీచుడు | రావణుని స్నేహితుడు, రాక్షసుడు, మోసగాడు. |
| ఇంద్రజిత్తు | రావణుని కొమరుడు, అతి తంత్రము గలవాడు. |
| వానరుడు | కోతి, చెడ్డపని చేసేవాడు. |
| కుంభకర్ణుడు | రావణుని తమ్ముడు, నిద్రముచ్చు. |
| రావణుడు | పులస్త్యబ్రహ్మ కొమారుడగు రాక్షసుడు, అతి సమర్థుడు. |
| జాంబవంతుడు | బ్రహ్మదేవుని కొమారుడు, అతి వయోవంతుడు. |
| శనేశ్వరుడు | నవ గ్రహములలో నేడవగ్రహము, అదృష్టహీనుడు. |
| శుక్రాచార్యుడు | నవగ్రహములో ఆరవగ్రహము, ఏకాక్షి. |
| బ్రహ్మదేవుడు | సృష్టికర్త, అతి స్వతంత్రుడు. |
| యమధర్మరాజు | దక్షణదిక్కధిపతి, అతి భయంకరుడు. |
| విఘ్నేశ్వరుడు | గణపతి, ఈశ్వరుని కొమారుడు, బొజ్జకడుపుగలవాడు. |
| యనాథ | ప్రభువులేని వాడు, వ్యర్థుడు. |
| యుగంధరుడు | ప్రతాపరుద్రుని మంత్రి, అతి యుక్తిపరుడు. |
| కాలాంతకుడు | యముడు, మహాసమర్థుడు. |
| చిత్రగుప్తుడు | యమునివద్ద గణికుడు, మిక్కిలి వ్రాతగాడు. |
| శకుని | దుర్యోధనుని మేనమామ, మోసగాడు. |
| సైంధవుడు | దుర్యోధనుని బావమరిది, కార్యహాని చేయువాడు. |
| దృతరాష్ట్రుడు | ధుర్యోధనుని తండ్రి, పుట్టు అంధుడు. |

| | |
|---|---|
| వైదికి | వేదము చదివినవాడు, లౌకికము తెలియనివాడు. |
| ఏలేశ్వరవుపాధ్యాయులు | ఆంధ్రదేశమున ప్రసిద్ధ పండితుడు, స్వతంత్రశక్తిగలవాడు. |
| ఆకతాయి | చంపెడు స్వభావముగలవాడు, పోకిరి. |
| అగ్నిహోత్రుడు | పరిశుద్ధుడు, సర్వభక్షకుడు. |

## స్త్రీవాచక శబ్దములు

| | |
|---|---|
| చిత్రాంగి | రాజరాజనరేంద్రుని సతి, అతి దుర్మార్గురాలు. |
| ఊర్వశి | ఇంద్రసభలో పాటబాడు అప్సర స్త్రీ, సుబుద్ధి గలిగినది. |
| రంభ | ఇంద్రసభలో నాట్యమాడు అప్సర స్త్రీ, అతిరూపవతి. |
| విధవ | పెనిమిటిలేనిది, వ్యర్థురాలు. |
| జ్యేష్ఠాదేవి | పెద్దమ్మ, విష్ణుదేవుని పెద్దభార్య, యదృష్టహీనురాలు. |
| మండోదరి | రావణుని భార్య, గాంభీర్య రూపముగల స్త్రీ. |
| సత్యభామ | కృష్ణుని భార్య, మిక్కిలి అందకత్తె. |
| శూర్పణఖ | రావణుని చెల్లెలు, దుర్మార్గురాలు. |
| మిత్రవింద | కృష్ణునిభార్య, మిక్కిలి యుక్తిగల స్త్రీ. |
| సరస్వతి | బ్రహ్మదేవుని భార్య, మిక్కిలి చదవరి. |
| నంగనాచి | కాంచీమండలమందున్న యొక ఆడుది, అతి చాతుర్యము గలది. |
| మందర | కైకేయి యొక్క దాసి, తంత్రముగల స్త్రీ. |
| తాటకి | ఒక రాక్షస స్త్రీ, దుర్మార్గురాలు. |
| కైకేయి | దశరథమహారాజుకు మూడోభార్య, అతి మూర్ఖురాలు. |

## జంతువాచక శబ్దములు

| | |
|---|---|
| పక్షి | రెక్కలుగల ప్రసిద్ధి జంతువు, తెలివిలేనిది. |
| కర్కోటకము | సర్పవిశేషము, అతి క్రూరుడు. |
| శేషాహి | ఆదిశేషుడనే సర్పము, మిక్కిలి సమర్థుడు. |
| కామధేనువు | సముద్రమథనమునగలిగిన గోవు, సమస్తము నిచ్చేది. |
| పక్షిరాజు | గరుత్మంతుడు, అనామధేయుడు. |
| కుక్క | శునకము, వదరుపోతు. |
| నక్క | జంబుకము, తంత్రముగలది. |
| పులి | వ్యాఘ్రము, అతి ధైర్యశాలి. |
| పిల్లి | మార్జాలము, పాలుముచ్చు. |

| | |
|---|---|
| దోమ | మశకము, అల్పుడు. |
| పశువు | చతుష్పాద జంతువు, తెలివిలేనిది. |
| గాడిదె | గార్దభము, మడ్డి జంతువు. |
| సింహము | మృగరాజు, అతిశూరుడు. |
| ఎనుబోతు | మహిషము, మడ్డివాడు. |
| కరటకదమనకులు | పంచతంత్రగ్రంథమున ప్రసిద్ధంబగు అతితంత్రముగల మనుష్యులు, నక్కలు. |

## అచేతనార్థక శబ్దములు

| | |
|---|---|
| రత్నము | మణి, మిక్కిలి యోగ్యుడు. |
| వజ్రము | నవరత్నములలో నొకటి, మిక్కిలి యోగ్యమైనది. |
| ముత్యము | నవరత్నములలో నొకటి, మిక్కిలి యోగ్యుడు. |
| సీసము | పంచలోహములలో నొకతి, పిచ్చివాడు. |
| చట్రాయి | మిక్కిలి కఠినముగల బండ, పనిచేయని పంద. |
| గాండీవము | అర్జునిని ధనస్సు, నెరవేర్చలేని పని. |
| వసనాభి | విషభేదము, అతి దుర్మార్గుడు. |
| నిమ్మకాయ | లికుచఫలము, వెఱ్ఱివాడు. |
| అపరంజి | చొక్కపు బంగారము, మిక్కిలి సమర్థుడు. |
| విషము | జీవుల చంపే వస్తువు, అతి దుర్మార్గమైనది. |
| సంకిలి | శృంఖలము, భూమి స్థలము బంధకము. |
| స్వర్గము | పుణ్యాత్ములు వసించెడు సుఖప్రదేశము. |
| నరకము | పాపజనులు వసించెడు స్థలము, అసహ్యము. |
| సముద్రము | సాగరము, నెరవేరలేని పని. |
| పుంజలూరు | ఒక గ్రామ విశేషము, వ్యర్థుడు. |
| మన్ను | మృత్తిక, సర్వాభావము. |

## ఆరు స్వరములకు మించని మాటలు

అన్న దానముచేసేవారికి ఉపద్రవము చేయడము చెరువులు తెగగొట్టడము బిడ్డలకు చదువు నేర్పకపోవడము యివి ద్రోహకార్యములని తెలిసికొనవలెను.

అపరిమితముగా నవ్వరాదు.

అప్రయోజకులు పదిమంది పుట్టుటకంటే ప్రయోజకుడు ఒకడే చాలును.

అసాధారణమైన ప్రజ్ఞగలవాడు సుఖపడును.

ఆదాయమునకు తగిన సెలవుచేయవలెను.

ఉపనయనము చేసినవారును, మంత్రము నుపదేశించినవారును, భయమునుపోగొట్టి కాపాడినవారును, విద్యనేర్పినవారును తల్లి తండ్రితో సమానులని యెంచవలెను.

ఒకరికి వుపకారము చేయవలెను.

ఒకరుచేసిన వుపకారము మరువవద్దు.

కమలములు నీటిలోనుంచి బయటికి వచ్చినపుడు యెండకువాడినట్లు తమతమ స్థానము తప్పితే తమ మిత్రులే శత్రులౌదురు.

చదువునేర్చుకొను విషయములో సిగ్గుపడరాదు.

తనవారియందు మొగమాటముంచవలెను.

తనయాజ్ఞను అతిక్రమించిన బంటును విడువవలెను.

తనకు యెంత ఆపదవచ్చినను అబద్ధము చెప్పరాదు.

దురహంకారము మానవలెను.

దుష్టులకు వుపకారము చేయబోతే కీడువచ్చును.

దొంగతనము చేయరాదు.

నిండా బలముగల శత్రువులను వుపాయము చేత జయింపవలెను.

నిండు ప్రవాహములో యీదరాదు.

పరపత్యము పుట్టనిచోట కాపురము చేయరాదు.

పక్షులలో కాకి నీచము, మృగములలో గాడిదె నీచము, సన్యాసులలో కోపముగలవాడు నీచుడు, వొకరిని యెప్పుడు దూషిచువాడు అందరికంటె నీచుడు.

పాముకు విషము కోరలయందుండును, యీగకు విషము తలయందుండును, త్రేలునకు విషము కొండెయందుండును, దుర్జనులకు నిలువెల్లను విషమేయగును.

సముద్రము మీద వర్షము కురియడము, ఆకలిలేనివానికి భోజనము పెట్టడము, కలిగినవారికి దానము జేయడము వ్యర్థము.

పిలువని పేరంటమునకు పోరాదు.

పెద్దల ఆశీర్వచనము వ్యర్థము కాదు.

పేదలను అవమానించరాదు.

బంధువులను విడువరాదు.

బలవంతునితో విరోధము చేయరాదు.

బుద్ధిమంతులతో సహవాసము చేయవలెను.

భాగ్యముచేత బంధువులను తృణీకరించరాదు.

భాగ్యముపోయెడి సమయములో యేనుగుమ్రింగిన వెలగపండులోని గుజ్జువలె మాయమగును.

భాగ్యము వచ్చెడి సమయములో టెంకాయలోని నీళ్ళు వచ్చినట్లు తనకుతానే వచ్చును.

మూర్ఖుడు తన యింట్లో మాత్రమే పూజింపబడును, ధనికుడు తన గ్రామములోనే పూజింపబడును, రాజు తన రాజ్యములో మాత్రమే పూజింబడును, విద్వాంసులు సకల దేశములందును పూజింపబడును.

యోగ్యత చక్కగా విచారించి అధికారమివ్వడము, వాడిన చేనలమీద వానకురియడము, ఆకలిగొన్నవారికి అన్నము పెట్టడము, పేదవానికి దానము చేయడము సార్థకము.

శరీరబలముకంటె నీతి యెక్కువ.

## దృష్టాంత వాక్యములు

బిడ్డలకు చిన్నతనమునందు నేర్చినవిద్య లెస్సగా బుద్ధియందుబట్టును. వెనుక నేర్చిన విద్య లెస్సగా పట్టదు. రంగు నూతన వస్త్రమునందు పట్టినట్లు పాతవస్త్రమున పట్టదుగదా.

విద్య వచ్చినవానికిన్ని విద్యరానివానికిన్ని రూపమొకటిగానున్నను విద్యవచ్చినవాడే మేలు. హంసకున్ను కొంగకున్ను రూపమొకటిగానున్నను నీళ్ళతోగలసిన పాలను వేరుపరచే హంసమేలుగదా.

విద్యగలవానికి రూపములేక యుండినను మెప్పుగలదు. విద్యలేనివానికి రూపముండినను దానివలె మెప్పులేదు. సువాసనగల కురువేరు రూపములేకయున్న మెచ్చబడును సువాసనలేని మోదుగపువ్వు రూపముగలిగియున్నను దానివలె మెచ్చబడదుగదా.

వివేకముగలవాడు దరిద్రుడైనను సభాపూజ్యుడౌను, వికము లేనివాడు భాగ్యవంతుడైనను వానివలెసభాపూజ్యుడు కానేరడు. తెలివిగల కన్నులు సొమ్ములు లేకున్నను వాసికెక్కుటయును తెలివిలేని చేతులు సొప్పులు గలిగియున్నను వాటివలె వాసికెక్కనేరవుగదా.

మంచివాని సహవాసము మంచిగుణముదెచ్చును చెడువాని సహవాసము చెడుదెచ్చును. వాననీళ్ళు రేగటినేలబడి మంచినీళ్ళగును, చవిటినేలబడి యుప్పునీళ్ళవునుగదా.

ఎల్లప్పుడు కఠినవచనములు జెప్పేవానికి అవమానముగల్గును. ఎప్పుడు ప్రియముగా పలికెడు చిలుకకు పాలుపండ్లు పెట్టి పెంచుదురు కఠినముగ పలికే కాకిని రాళ్ళతో కొట్టి తరుముదురుగదా.

బలవతుడు పైకొనిరాగ వంగినవానికి మేలుగలదు. ఎదిర్చినవానికి చేటుగలదు. ఏటి వరదకు వంగియున్న ప్రబ్బతీగలు మేలుపొందును యెదుటనిలిచియున్న మ్రాకులు చేటుబొందునుగదా.

గొప్పవంశమునందు బుట్టినను గుణములేనివాని నౌకరును దగ్గరితీసుకొనరు హీనవంశమున పుట్టినను గుణముగలవానినందరును దగ్గర తీనుకునుదురు, వాసనలేని చెరుకుపువ్వులొకరికిని యోగ్యములుకావు, వాసనగల గన్నేరుపువ్వుచందరికిని యోగ్యములౌనుగదా.

ఉపకారము మంచివానికి నొకమారు చేసినట్టయిన పలుమారు ఫలమును బొందవచ్చును. చెడువానికి నొకమారుదప్పనేని కొంచెమైనను ఫలమును బొందరాదు. తాటిచెట్టు వొకే దినము విత్తునాటి నీళ్ళుబోసినవానికి నెల్లప్పుడు ఫలమునిచ్చును. పోకచెట్టు వొకదినమునందు నీళ్ళు పోయనివానికి కొంచెమైనను ఫలము నియ్యదుగదా.

దానము యోగ్యులయందు ప్రకాశించును అయోగ్యులయందు ప్రకాశించదు. వాన చినుకులు ముత్యపు చిప్పలో బడెనేని ముత్యములుగా నగపడును, యిసుకలో బడెనేని రూపమే యగుపడదుగదా.

మానవంతుడు తనకెంత ప్రాయాస వచ్చినను గొప్పపని గోరునుగాని చిన్నపని గోరడు. సింహము మెండాకలిచేత డస్సియున్నను యేనుగు మాంసమును కోరునేగాని పూరిమేయదుగదా.

మానహీనుడు చిన్నపని సంపాదించి నిండా సంతోషించును వానిచేత వాని ప్రయాసతీరదు. శునకము దుర్గంధమైన యెముకను సంపాదించి నిండా సంతోషించును దానిచేత దాని యాకలి తీరదుకదా.

భాగ్యవంతుడు తనయొద్దనున్న ధనమును పేదలకిచ్చి దరిద్రుడైనను కీర్తి హెచ్చియుండునుగాని తగ్గియుండదు, సానబెట్టిన మాణిక్యము యెత్తు తగ్గినను వెల హెచ్చియుండునుగాని తగ్గియుండదుగదా.

దుష్టుడు భాగ్యవంతుడైనను వానివద్దజేరినవారిని దుఃఖము వచ్చునుగాని సుఖము రానేరదు, మాణిక్యమును బెట్టియున్న పామువద్దజేరినవారికి ప్రాణాపదవచ్చునుగాని మాణిక్యము రానేరదుగదా.

సంపద పొడుగుచుండగా మంచివాడు అణకువగానుండును దుష్టుడు మిట్టిపడును, వృక్షము ఫలకాలమునందు అణగియుండును ఏరు వర్షాకాలమున మిన్నంటి యుండునుగదా.

ఘనమైనవాడు అల్పునిజేరగా వాని ఘనము చెడును అల్పుడు ఘనమైనవానిజేరగా ఘనమువచ్చును రాతికంబము తెప్పజేరి నీళ్ళమీద దేలును దారం పుష్పముజేరి తలమీద నెక్కునుగదా.

ధనముగలవానిచెంత నందరును చేరుదురు ధనములేనివానిచెంత నెవ్వరునుచేరరు, నీళ్ళు నిండియున్న చెరువులో నన్ని జంతువులుచేరును ఎండియునన్న చెరువులో నొక జంతువును చేరదుగదా.

వివేకము గలవాడు దూరమునందుండి పరులగుణమును దెలిసికొనును వివేకములేనివాడు సమీపమునందుడియు దెలిసికొనజాలడు, తుమ్మెదలు దూరమునందుండియు తామరపువ్వులవాసన దెలిసికొనుచున్నది, కప్ప సమీపమున నుండియు దెలికొకొనఁ జాలదుగదా.

గొప్పమనిషి తానొక కార్యమునందు జొచ్చి యందరికి మేటిగా నుడవలెను అటుగాని పక్షాన తానున్న చోటునుండి కృశింపవలెను చెట్టునపూచిన పువ్వులందరి తలలమీద నెక్కును, అటుగానిచో చెట్టుక్రింద రాలిపోవునుగద

లోకమునందు తానుదినక నొకరికిబెట్టక దాచిపెట్టిన సొమ్ము తనకు చేటుదెచ్చి పరులపాలగును, అడవిలోనీగలు చేర్చిపెట్టిన తేనె వానిని చంపి తాని జనులపాలవుచున్నదిగదా.

రూపము చక్కగానున్నందున మంచివాడనియు, వంకరగానున్నందున చెడువాడని తెలిసికొనరాదు, కార్యముచే దెలిసికొనవలయును. చక్కగానున్న బాణము చెడుకార్యము చేయుచున్నది. వంకరగాయున్న వీణ మంచికార్యము చేయుచున్నదిగదా.

దుష్టుని సహాయముచేత నొకపని కావలసినప్పుడు వానితో కొంచముగా సహవాసము చేయవలెనుగాని నిండా సహవాసము చేయరాదు. తాంబూలము వేసుకొనునపుడు సున్నం కొంచెముగా చేర్చుకొందురుగాని నిండా చేర్చుకొనరుగదా.

ఉపకారము సత్పురుషునకు చేయవలెను చెడుపురుషునకు చేయరాదు, ఆవునకు కసువువేసిన పాలిచ్చును పామునకు పాలుపోసిన కరచి విషముపెట్టునుగదా.
తాను నేర్చినవిద్య శిష్యులకు ఉపయోగముచేయుటచేత తరగదు పరిశుద్ధమై యుండును లేని పక్షమున పరచిపోవును, చెలమనీళ్ళు చల్లినందున పరిశుద్ధమై యుండును లేని పక్షమున జెడిపోవును గదా.

## ద్వంద్వ వాక్యములు

### ౧ లక్ష్మీనివాస స్థానములు

సత్యవంతుల యందును సలక్షణమైన గృహములయందును రాజులయందును వీరులయందును జయధ్వజములయందును ఏనుగుల యందును గుఱ్ఱములయందును గోవులయందును ఛత్రచామరముల యందును తామర పువ్వుల యందును పంటభూకుల యందును పూదోటల యందును స్వరంవరముల యందును రత్నములయందును దీపములయందును అద్దములు మొదలైన మఙ్గళ వస్తువున యందును లక్ష్మి వాసము చేయును.

### ౨ అలక్ష్మీనివాస స్థానములు

అసత్యవంతులయందును పాతివ్రత్యములేని స్త్రీల కాలి దువ్వలయందును మేకలకాలి దువ్వలయందును పొరకదువ్వలయందును మైనీడయందును మంచము నీడయందును అతినిద్ర గలవానియందును తాండ్రచెట్టు యందును రావిచెట్టుయందును దీపము నీడయందును దురాచారి ముఖమునందును కాటిపొగయందును అలక్ష్మివాసము చేయును.

### ౩ సంపద్గుణములు

సంపదగలవారికి కీర్తిగలుగును గొప్పతనము వచ్చును. ఏపనిజేసినదగియుండును. ఏమాటజెప్పియు జెల్లించుకొనును. ఘనమైన పని తృణమువలె తోచును. ఒకప్పుడు జూడనివారు మిత్రులవలె జూతురు. తనవారిలో నెక్కువగానుందురు. శత్రులుమిత్రులగుదురు. తలచినపని చేకూడును. మిక్కిలి సామర్థ్యము గలుగును. సత్రములు చావళ్ళు మొదలైన ధర్మములు సిద్ధించును. వస్త్రవాహనములు మొదలైన భోగములు గలుగును.

### ౪ దారిద్ర్యములు

దరిద్రుని తల్లి తప్పులు చెప్పును. భార్యయును లక్ష్యపెట్టదు. నోటవచ్చు మాటలన్ని విపరీతముగా తోచును. తీరని దుఃఖమునను‌భవించును. సభలోకిబోవ సంకోశపడును. భాగ్యవంతుని యెదుట నిలువ భయపడును. శౌర్యము సన్నమగును. ఇంటికి వచ్చిన చుట్టములు యమదూతలవలె నగుబడుదురు. పెత్తనము దక్కదు. ఎవరితోనేమి చెప్పినను మారుత్తరముబుట్టదు. అందరుననపహరింతురు.

## ౫ పుణ్యములు

దేవునియందు భక్తిగలుగుట మనస్సుజేసిన పుణ్యము. దేవునినామమునుచ్ఛరించుట నోరు చేసిన పుణ్యము. దేవుని పూజించుట చేతులు చేసిన పుణ్యము. దేవాలయమునకుబోవుట కాళ్ళు చేసిన పుణ్యము. దేవునిజూచుట కళ్ళుజేసిన పుణ్యము. దేవుని కథలు వినుట చెవులజేసిన పుణ్యము. దేవునికి వందనము జేయుట శిరస్సుజేసిన పుణ్యము.

## ౬ పాపములు

పరులకు కీడుదలచుట మనసుజేసిన పాపము. పరులను పరుషవాక్యములు పలుకుట నోరుజేసిన పాపము. పరధనమునహరించుట చేతులుజేసిన పాపము. పరుల శ్రమమునెంచని వానివద్ద దిరుగుట కాళ్ళుజేసిన పాపము. పరనిందవినుట చెవులుజేసిన పాపము. ప్రీతిలేని యన్నమడుగుట నాలుకజేసి పాపము. పరస్త్రీల నాలింగనముజేయుట దేహముజేసిన పాపము.

## ౭ చేయవలసిన పనులు

పితృవాక్య పరిపాలనచేత శ్రీరాములు కీర్తి వహించెను. పితృవాక్య పరిపాలనచేత గరుడుండు యశముబొందెను. సత్య వ్రతముచేత భీష్ముండు పొగడొందెను. సత్యవాక్యముచేత హరిశ్చంద్రుడు ఖ్యాతిబొందెను. దానముచేత బలిచక్రవర్తినుతికెక్కెను. ఓర్పుచేత ధర్మరాజు గొప్పబడెను. పెద్దలుతలపెట్టిన పనినెరవేర్చుటచేత బగీరథుండు ప్రఖ్యాతిగాంచెను. కావున నీపనులు పురుషునకు నావశ్యకంబులు.

## ౮ జేయరాని పనులు

జూదమాడి నలచక్రవర్తి దుఃఖపడెను. పరస్త్రీ మోహముచేత రావణుడు నశించెను. తమ్ముని పగచేత వాలిమృతిబొందెను. దుష్టకృత్యముచేత పరీక్షిన్మహారాజు జయించెను. వంచనచేత నిల్వలుండు రూపడంగెను. పరద్రవ్యాశచేత దుర్యోధనుడు కీడునొందెను. అహంకారముచేత హిరణ్యకశిపుడు హానిజెందెను. కావుననీపనులు పురుషునకు నర్హములుగావు.

## ౯ అమృతము

దేవతలకు స్వర్గమందును, చకోరములకు చంద్రునియందును, చాతకములకు మేఘమునందును, బ్రాహ్మణులకు విద్యయందును, రాజులకు యుద్ధమందును, కవులకు వాక్కుయందును, భక్తులకు భగవంతునుయందును, రోగులకు ఔషధమందును, స్త్రీలకు అధరమందును అమృతముండును.

## ౧౦ విషము

చోరులకు చేతులయందును, స్త్రీలకు స్తనములయందును, కొండెగానికి నాలుకయందును, కాముకునికి కన్నులయందును, పాముకు పల్లులయందును, తేలుకు కొండెమునందును, ఈగకు తలయందును విషముండును.

## ౧౧ ఎప్పుడును సుగుణమును విడువనివి

బంగారము పుటము పెట్టబడియు వన్నె మాఱదు. గంధపుజెక్క యఱిగియు వాసన విడువదు. శంఖము భస్మమయ్యును తెలుపు మాఱదు. పాలు కాగుయు రుచి విడువదు. మాణిక్యము సానలో నఱిగియు కాంతి తగ్గదు. దాత యెంతలేమిని పొందియు దాతృత్వము విడువఁడు. వీరుడు శత్రువుచే నఱకబడియు పరాక్రమము విడువడు. మంచివాడెంత ప్రయాసబొందియు మర్యాదదప్పడు.

## ౧౨ ఎప్పుడును దోషమును విడువనివి

వేపచెట్టుకు తేనె పోసి పెంచినను చేదు మానదు. పామునకు పాలు పోసినను విషము పోదు. గాడిదనెంత చక్కబెట్టినను జోడుకాలు మానదు. కుక్కతోక బద్దవేసి కట్టినను చక్కగారాదు. గుడ్డి కంటికి కుంచెడు కాటుకబెట్టినను కనిపించదు. ఉల్లిగడ్డకు పన్నీరు పోసినను కంపు మానదు. మూర్ఖునికి యెంతజెప్పినను తెలివిరాదు.

## ౧౩ చచ్చియు బ్రతికియున్నవారు

పరోపకారముగా గుంటలు, బావులు, చెఱువులు మొదలయిన జలాధారములు గలుగజేసినవారును. జలాధారములు గలుగజేసినవారును. తోటలు, దొరువులు మొదలైన వనములు వేసినవారును. గుళ్ళు, గోపురములు, సత్రములు, చావళ్ళు గట్టించినవారును. అగ్రహారము మొదలగు శాశ్వతధర్మములు చేసినవారును, నీతిదప్పనిరాజును, యుద్ధరంగమునందు వెనుదీయ్యనివాడును, గొప్పవిద్య నేర్చినవాడును, కృతియొనర్చినవాడును, కృతినందినవాడును, కృతినిబహూకృతిగ బొందినవాడును, సత్పుత్రుని గన్నవాడును - అను వీరు చచ్చియు బ్రతికియున్నవారు.

## ౧౪ బ్రతికియు చచ్చినవారు

ఎడతెగని దారిద్ర్యము ననుభవించువాడును, తీఱని రోగముగలవాడును, ఎల్లప్పుడు నిల్లంట్ర మున్నవాడును, స్త్రీభాగ్యముచే జీవించువాడును, రాజసభలో భంగపడినవాడును, భార్యధనముచేత జీవనము చేయువాడును, తీఱనిదుఃఖము ననుభవించువాడును, ఆడుదానికి వెఱచువాడును, అర్థులకు నుపకారము చేయనివాడును, రహస్యమైనపని ఱచ్చకుదెచ్చువాడును - అను వీరు బ్రతికియు చచ్చినవారు.

## ౧౫ సమయమునందు ఉపకరించునవి

వయస్సున బుట్టిన పుత్రుండును, కాలమునందు బెట్టిన పైరును, నాణ్యముగలవాని యొద్దనుంచిన ధనమును, బాల్యమునందు నభ్యసించిన విద్యయు, సత్పురుషుల సఖ్యమును, మంచివానికిచేసినయుపకారమును సమయమునందు ఉపకరించును.

## ౧౬ సమయమునందు ఉపకరింపనివి

ముదిమిని బుట్టిన పుత్త్రుండును, అకాలమునందు బెట్టినపైరును, దబ్బఱకానియొద్ద నుంచిన ధనమును, పుస్తకమందున్న విద్యయును, కపటముగలవాని సఖ్యమును, చెడువానికిజేసిన యుపకారమును, దేశాంతరమునందున్న పుత్త్రుని సంపదయును, అప్పిచ్చిన యర్థమును సమయమునందు ఉపకరింపవు.

## ౧౭ ఒకటి గలిగి ప్రకాశించునవి

సూర్యుడు గల పగలును, చంద్రుడు గల రాత్రియు, ఉత్తముడు గల భూమియు, గుణవతియగు భార్య గల పురుషుడు, రాజు గల రాజ్యమును, వేగము గల గుఱ్ఱమును, శ్రుతి గల రాగమును, కాపు గల యూరును, వివేకము గల తపస్సును, చదువు గల బుద్ధియు, సత్యము గల వాక్కును ప్రకాశించును.

## ౧౮ ఒకటి లేక ప్రకాశింపనివి

మాధుర్యములేని సాహిత్యము, బిడ్డలులేని యిండ్లును, పెద్దలులేని ఊరును, గుఱ్ఱములులేని దళములు, గుణములేని స్త్రీలును, భక్తిలేని పూజలును, వాసనలేని పుష్పములు, చదువులేని రూపమును, ఆయుధములేని బంటును, మంత్రిలేని సభయును, పుష్టిలేని దంతములును, కొప్పులేని స్త్రీలును, ప్రీతిలేని విందును, మంచిమాటలులేని స్నేహమును ప్రకాశింపవు.

## ౧౯ ఒక గుణముచేత మఱియొక గుణము గలుగునవి

అధికారముచేత సామర్థ్యమును, వస్త్రాభరణాదులచేత సౌందర్యమును, సంపదచేత మర్యాదయును, దాతృత్వముచేత కీర్తియును, వినయముచేత గొప్పతనమును, వైరాగ్యముచేత జ్ఞానమును, భక్తిచేత భగవదనుగ్రహమును, ప్రియవాక్యముచేత లోకావశ్యకతయును, సుగుణముచేత ధనమును సిద్ధముగ వచ్చును.

## ౨౦ ఒక దోషముచేత మఱియొక దోషము గలుగునవి

కామముచేత వ్రతనాశనమును, కోపముచేత జీవిహింసయును, లోభముచేత దొంగతనమును, వంచనచేత నసత్యమును, అశౌర్యముచేత భయమును, అజ్ఞానముచేత అవివేకమును, దుష్టత్వముచేత శత్రుత్వమును, దుస్సాహముచేత ప్రాణభయమును, గర్వముచేత అపజయమును, వల్లకానిపనిచేత అపాయమును, చుడుపనిచేత నపకీర్తియును సిద్ధముగ వచ్చును.

## ౨౧ వ్యాధిబుట్టింపనివి

పరిశుద్ధమైన భోజనమును, భోజనానంతరము కొంచెముగ నడుచుటయు, స్నానపానములయందు క్రమము తప్పక యుండుటయును, కాలమునందు జలమలవిసర్జనమును, దినమునకు రెండుమార్లు భోజనమును, కాలమునందు నిద్రయును, ఎడమప్రక్క శయనించుటయును రోగమును బుట్టింపవు.

## ౨౨ వ్యాధిబుట్టించునవి

మితిదప్పిన భోజనమును, మనోదుఃఖమును, అధిక సంచారమును, జలమలనిరోధమును, భోజనముచేసి స్నానము చేయుటయును, క్రొత్త నీళ్ళు ద్రాగుటయును, మంచిగాలి సోకకుండుటయును, రాత్రి పెరుగు ద్రాగుటయును, లేత యెండ సోకుటయును, పాసిన కూడు భక్షించుటయును, అపక్వభక్షణమును రోగమును పుట్టించును.

## ౨౩ దేవతలు

కన్న తండ్రియును, పోషించినవాడును, విద్యజెప్పినవాడును, మంత్రమునుపదేశించినవాడును, ఆపత్కాలమునందు రక్షించినవాడును, దారిద్ర్యమును పోగొట్టినవాడును, భయమును పోగొట్టినవాడును, పడుచు నిచ్చినవాడును, జ్ఞానము నుపదేశించినవాడును, జ్యేష్ఠభ్రాతయును, రాజును, భగవద్భక్తుడును దేవతలతో సమానులు.

## ౨౪ రాక్షసులు

రాజాజ్ఞ మీఱినవాడును, మితిమీరి అప్పుచేసినవాడును, సభ నెదిరించినవాడును, విరసముగ పరిహాసముజేయువాడును, ప్రభువునకు నణంగని సేవకుడును, పురుషునకు నణంగని యాడుదియును, తనవంటివాడు మఱియు ఆడుదానిమాట విని కలహించువాడును, చేసిన యుపకారము మఱచువాడును వీరలు రాక్షసులతో సమానులు.

## ౨౫ మంచియున్నచోట చెడుయు ఉండును

తామరలున్న కొలనులో గోరుచుట్లు నుండును. కోయిలలున్న వనములో గుడ్లగూబ లుండును. రత్నములున్న గనిలో రాళ్ళుండును, శ్రీగంధముజెట్లున్న యడవిలో ముండ్ల చెట్లుండును. పువ్వులున్న యంగడిలో కట్టెలుండును. చిలుకలున్నచోటులో కాకులుండును. భాగ్యవంతులున్నచోట దరిద్రులుందురు. విద్వాంసులున్న సభల మూఢులుందురు. పుణ్యాత్ములున్న ఊరిలో పాపులుందురు. ధార్మికులున్నచోట అధర్మపరులుందురు. దాతలున్నచోట పిసినారులుందురు. ఆస్తికులున్నచోట నాస్తికులుందురు. ఇది లోక విదితము.

# నీతి కథలు

## గొల్లపిల్లవాడు పులి కథ

ఒక గ్రామములో ఒక తండ్రి, కొడుకుతో కలిసి నివసించుచుండెను. ఒకనాడు తండ్రి అడవికి మేకలను మేపుటకు వెళ్ళుచూ తన కుమారుని కూడ వెంటబెట్టుకుని పోయెను. అడవిలో కొంతదూరము వెళ్ళిన తరువాత తండ్రి కొడుకును మేకలకు కాపలాబెట్టి తాను వంటచెఱకు కొఱకు పోవుచున్నానని ఒకవేళ పులి వచ్చినచొ తనను పిలవమని అతనికి చెప్పి వెళ్లెను.

కొంతసేపయిన తరువాత నాయన వచ్చునా లేదా అని తలంచి కొడుకు "నాయనా! పులివచ్చె"నని బిగ్గరగా అరచెను. అదివిని ఆ తండ్రి వచ్చి చూడగా పులిలేదు గిలీలేదు అనెను. అలాగే మరియొకసారి "నాయనా! పులివచ్చె" అని బిగ్గరగా అరచెను. అదివిని ఆ తండ్రి వచ్చి చూడగా పులిలేదు గిలీలేదు అనెను. అలాగే మరియొకసారి "నాయనా! పులివచ్చె" అని బిగ్గరగా అరచెను. అదివిని ఆ తండ్రి మరల త్వరత్వరగా అచ్చటకు వచ్చి చూడగా పులిలేదు గిలీలేదు అనెను. తండ్రి కొడుకును కోపించి వెళ్ళినాడు. ఇంతలో పులి నిజముగా రానే వచ్చినది. అప్పుడు కొడుకు బిగ్గరగా "నాయనా! పులివచ్చె పులివచ్చె" అని బిగ్గరగా బెంబేలుపడి అరచినాడు.తండ్రి మునుపటివలె ఊరకనే అరచుచున్నాడని తలంచి అతని మాటలు చెవినపెట్టక ఊరకుండెను. పులి మేకలను చంపి తినివేసిపోయెను.

నీతి: ఒకసారి అబద్ధము చెప్పిన మరియొకసారి వాని మాటలు ఎవరు నమ్మరు కావున నవ్వులాటకైనా అబద్ధము చెప్పరాదు అను నీతి గుర్తింపవలెను.

## తండ్రి కొడుకుల కథ

పూర్వము ఒక గ్రామములో ఒక తండ్రి తన నలుగురు కొడుకులతో జీవించుచుండెను. అతను తన నలుగురు కొడుకులలో పెద్ద కొడుకునకు తన యావదాస్తిని యిచ్చివేసెను. రెండవ కొడుకునకు తన జీవిత వృత్తిని నేర్పెను. మూడవవానికి విద్యను నేర్పెను. నాల్గవవానికి వ్యాపారమునకు కావలసిన వాటిని సమకూర్చెను. కొద్దికాలము తరువాత పెద్దవఅడు తన ఆస్తిని పూర్తిగా ఖర్చుచేసుకొని బీదవాడయ్యెను. రెండవవాడు తన వృత్తిని పాటించక బీదవాడయ్యెను. మూడవవాడు తను నేర్చుకున్న విద్యతో ధనము సంపాదించి సుఖపడెను. నాల్గవ వాడు వ్యాపారములో నష్టమువచ్చి బీదవాడయ్యెను.

నీతి: విద్య నేర్చిన వారు ఎంతో సుఖపడుదురు కావున విద్యనేర్చి ప్రతి మానవుడు వివేకవంతుడు కావలెను.

## పల్లెవాడు పాము కథ

ఒక పల్లెవాడు చెఱువు గట్టుపై నడుచుచు వెళ్ళుచుండెను. అతనికి ఒక చిన్న పాముపిల్ల కంటబడెను. దానిని ఇంటికి తీసుకొని వచ్చి పాలు పోసి పెంచుచుండెను. కొద్దికాలము తరువాత పాము పెద్దది అయి విషముతో కూడిన కోరలు కలదియై పెంచిన ఆ పల్లెవానినే కాటువేయుటకు సిద్ధపడెను. అప్పుడు ఆ పల్లెవాడు దానని కఱ్ఱతో కొట్టి చంపివేసెను.

నీతి: దుష్టులకు ఎప్పుడును మేలు చేయరాదు అట్లు చేసినచో చేసినవానికే కీడు తలపెట్టునను నీతిని గుర్తింపుము.

## నక్క ద్రాక్షపండు కథ

ఒక అడవిలో ఒక నక్క నివసించుచుండెడిది. ఆ నక్కకు ఆహారము లభించలేదు. నక్క ఆహారమునకొఱకు అల్లాడుచు సమీపమున ఉన్న గ్రామమునకు అహారమును వెదకుచు పోవుచుండెను. రెండు రోజులనుండి ఆహారములేక నక్క ఆకలి బాధకు తాళలేకున్నది. అప్పుడు దానికి ఒక చెట్టునకు ద్రాక్షతీగ అల్లుకొని కనబడెను. దాని నిండ ద్రాక్షపండ్లు గుత్తులు గుత్తులుగా వ్రేలాడుచుండెను. నక్క వానిని చూచి ఆనందముతో గంతులు వేసెను.

ద్రాక్షపండ్లు చాల ఎత్తున ఉండెను. నక్క వానిని అందుకొనవలెనని ఎగిరి, ఎగిరి విసుగు చెందినది. ఎంత ఎగిరినను అవి అందలేదు. అప్పుడు నక్క "అందని ద్రాక్ష పండ్లు పులుపు, వీటిని తినకూడదు" అని అనుకొని వెళ్ళిపోయెను.

నీతి: చేతకాని వానికి మాటలెక్కువ. తమ కార్యము సాధించలేక ఎదుటివారిపై నిందవేయుదురు అను నీతిని గుర్తింపవలెను.

## భీముడు సోముడు కథ

ఒక ఊరిలో ఒక వైశ్యునకు ఇద్దరు కొడుకులుండెడివారు. వారిలో ఒకడు సోముడు. మరొకడు భీముడు. ఆ ఇద్దరూ ఒకనాడు మామిడి పండ్ల కొఱకు ప్రక్కన ఉన్న మామిడి తోటకు వెళ్ళిరి. అప్పుడు భీముడు వాటిని చూచి "తమ్ముడా! ఈ మామిడి చెట్టుకు మంచి పండ్లున్నవి. కోయుదమా!" అని అనెను. సోముడు "అన్నా! ఈ తోటమాలి చూచినచో మనను పట్టికొట్టును" అని చెప్పెను. భీముడు వాని మాటలు లెక్కచేయక పండ్లు కోయుటకు చెట్టు ఎక్కెను. ఇంతలో తోటమాలి వచ్చి భీముని పట్టుకొని కొట్టెను.

నీతి: మంచివారి హితము వినకున్న చెడు కలుగును.

## తాబేలు కుందేలు కథ

ఒక అడవిలో ఒక కుందేలు అక్కడి చెఱువులో తాబేలు నివసించుచుండెను. కుందేలు ఒకనాడు తాబేలుతో "నాతో సమానముగా ఎవరును పరుగెత్తలేరు" అని ప్రగల్భములు పలికినది. అంతటితో ఊరుకొనక "నమ్మదలచినచో నాతో పందెము కాయుము గెలుపు ఎవరికి లభించునో తెలియును. ఒక మైలు పరిగెత్తెదము రమ్ము" అని తాబేలును ఉసిగొల్పెను. తాబేలు సరే అనెను.

పందెము ప్రారంభమయినది. కుందేలు గంతులు వేయుచు ముందుకు పరుగెత్తెను. తాబేలు మెల్లగా నడచుచుండెను. కుందేలు వేగముగా కొంత దూరము పరుగెత్తి వెనుకకు మరలి చూడగా తాబేలు జాడ కనిపించకపోవుటచే అక్కడేయున్న పొదలమాటున కొద్దిసేపు నిద్రించెను. ఇంతలో పట్టుదలతో పందెము నెగ్గవలెనన్న ఆశయముతోవున్న తాబేలు రానే వచ్చినది. నిద్రించుచున్ కుందేలును చూచి వేగముగా నడిచి తన గమ్యస్థానము చేరుకొనెను. కుందేలునకు మెలుకువ వచ్చి చూడగా తాబేలు కనబడలేదు. ఎక్కడనో వెనుక ఉండవచ్చునని భావించి గంతులేస్తూ ప్రయాణము సాగించెను. గమ్యస్థానము వద్దనున్న తాబేలును చూచి కుందేలు ఆశ్చర్యపోయెను.

నీతి: ప్రగల్భములు పలుకువారు పరుగుపెట్టలేరు అనగా గొప్పలు చెప్పుకొనువారు కార్యాన్ని సాధించలేరని భావము.

## కట్టెలు కొట్టువాడు బంగారు గొడ్డలి

ఒక ఊరిలో రామయ్య మఱియు సోమయ్య అను ఇరువురు వ్యక్తులు కలరు. రామయ్య కష్టజీవి. రోజూ అడవికి వెళ్ళి కట్టెలు కొట్టుకొనితెచ్చి వాటిని అమ్మి వచ్చిన డబ్బుతో ఇల్లు గడుపుకొనెడి వాడు.

ఒకనాడు రామయ్య కట్టెలు కొట్టుచుండగా గొడ్డలి పట్టుసడలి ప్రక్కన ఉన్న నదిలో పడినది. 'గొడ్డలి పోయినదే' అని రామయ్య వలవల ఏడ్చుచుండెను. అతని దుఃఖము చూచి ఆ నదీజలదేవత ప్రత్యక్షమై, ఎందుకు దుఃఖిస్తున్నావు అని అడుగి వివరములు తెలుసుకొని, వెంటనే నీటిలో మునిగి ఒక బంగారు గొడ్డలి తెచ్చి యిచ్చెను. రామయయ "ఈ గొడ్డలి నాదికాదు తల్లీ" అని అనెను. జలదేవత మరల నీటిలో మునిగి ఒక వెండి గొడ్డలి తెచ్చి యిచ్చెను. రామయ్య "ఈ గొడ్డలి కూడ నాది కాదు తల్లీ" అని అనెను. మరల జల దేవత నీటిలో మునిగి ఇనుపగొడ్డలి తీసికొని వచ్చెను. అప్పుడు రామయ్య ఆశతో "ఈగొడ్డలి నాదే తల్లీ" అని జలదేవతతో పలికెను. అప్పుడు జలదేవత రామయ్య యొక్క నిజాయితీని ప్రశంసించి తనుజూపిన బంగారు వెండి గొడ్డళ్ళను ఇనుపగొడ్డలితో కలిపి బహుమానముగా ఇచ్చి నిజాయితీగా జీవించమని చెప్పి అదృశ్యమయ్యెను.

కట్టెలు కొట్టుకొని జీవించే రామయ్య ఆ తరువాత మంచి తిండి, బట్ట, గూడు మొదలగు వాటిని సమకూర్చుకొని జీవించుచుండెను. ఈ మార్పులను చూసిన సోమయ్యకు ఆశ కలిగినది. అహుశా అతనికి అడవిలో ఏ నిధి అయినా దొరికియుండవలెనని తన మనస్సులో అనుకున్నాడు, ఈ విషయాన్ని రామయ్యద్వారా రాబట్టేను. మరుసటి రోజున సోమయ్య కూడ కట్టెలు కొట్టడానికి అడవికి వెళ్లినాడు. అతను ఒకచెట్టు ఎక్కి కట్టెలు కొట్టుచుట్లున్నగా నటించి తన గొడ్డలిని ఆ నదిలోకి విసరెను. పిమ్మట సోమయ్య ఏడవటము ప్రారంభించెను. ఆ సమయములో జలదేవత ప్రత్యక్షమై ఎందుకు దుఃఖిస్తున్నావని ప్రశ్నించెను. సోమయ్య తన గొడ్డలి ఈ నదిలో పడినదని చెప్పెను. అప్పుడు జలదేచత ఒక బంగారు గొడ్డలి తెచ్చి చూపెను. ఆ గొడ్డలి నీదేనా అని అడుగగా "అవును తల్లీ ఈ గొడ్డలి నాదే" అని జవాబిచ్చెను. ఆ తరువాత జలదేవత నీటిలో మునిగి వెండి గొడ్డలి తెచ్చి చూపెను. ఈ గొడ్డలి కూడ నీదేనా అని అడుగెను. అప్పుడు సోమయ్య "అవును తల్లీ ఈ గొడ్డలి కూడా నాదే" అని బదులు చెప్పెను. జలదేవత మరొకసారి నీటిలో మునిగి అతను పోగొట్టుకున్న ఇనుప గొడ్డలిని తీసికొనివచ్చి ఈ గొడ్డలి నీదేనా అని అడిగెను. "ఈ గొడ్డలి నాది కాదు" అని బదులు చెప్పెను. దానితో కోపించిన జలదేవత అతనికి బంగారు, వెండి గొడ్డళ్ళు కాదుకదా ఇనుప గొడ్డలి కూడ యివ్వకుండ అదృశ్యమయ్యెను. దీనితో సోమయ్య నది ఒడ్డున కూర్చొని రోదించసాగెను.

నీతి: దురాశ దుఃఖమునకు చేటు.

| | |
|---|---|
| త్రిఫలములు | కరక, తాడి, ఉసిరిక. |
| త్రిమదములు | విద్యామదము, ధనమదము, కులమదము. |
| త్రిలింగములు | శ్రీశైలము, ద్రాక్షారామము, కాళేశ్వరము. |
| త్రివిద్యలు | ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు, భగవద్గీత. |
| త్రివిధ రసాభాసలు | భార్యాభర్తలలో ఒకరికి మాత్రమే అనురాగము గలిగి యుండుట, తిర్యజ్మ్లేచ్ఛగత శృంగారము, కాంతకు బహునాయకాసక్తి. |
| త్రేతాగ్నులు | జఠరాగ్ని, దావాగ్ని, బడబాగ్ని. |
| త్రివిధేషణలు | నారేషణ - భార్య మొదలగు స్త్రీలయందు ఆశ, పుత్రేషణ - కుమారుల యందలి ఆశ, ధనేషణ - డబ్బుయందలి ఆశ. |
| త్రివిధ కాంక్షలు | కాంత, కనకము, కీర్తి. |

## ४ సంఖ్యలు గలవి

| | |
|---|---|
| చతుర్వేదములు | ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వవేదము. |
| పురుషార్థచతుష్టయములు | ధర్మము, అర్థము, కామము, మోక్షము. |
| చతుర్విధ కావ్యనాయకులు | ధీరోదాత్తుడు - ధైర్యము వంటి ఉదాత్తగుణము గలవాడు.<br>ధీరోద్ధతుడు - గర్వము, అసూయ, క్రోధము వంటి గుణములు గలవాడు.<br>ధీరశాంతుడు - ప్రసన్నాత్ముడు, ధీరుడు.<br>ధీరలలితుడు - నిశ్చింతుడు, కళలలో ఆసక్తి గలవాడు, నిరంతరము సుఖజీవనాభిలాషి. |
| చతుర్విధ శృంగారనాయకులు | అనుకూలుడు - ఒకే నాయిక యందు అనురాగము గలవాడు.<br>దక్షిణుడు - అనేక నాయికలను సమానముగఅ ప్రేమించువాడు.<br>ధృష్టుడు - నాయికపట్ల అపచారము చేసియు నిర్భయముగా ప్రవర్తించేవాడు.<br>శఠుడు - ఇతరులకు తెలియకుండా నాయికకు మాత్రమే తెలియునట్లు అప్రియము ఆచరించువాడు. |
| చతుర్విధ కవిత్వములు | చిత్ర, ఆశు, బంధ, గద్య కవిత్వములు. |
| చతుర్విధ అభినయములు | ఆంగిక, వాచిక, సాత్త్విక, ఆహార్య. |
| చతుర్విధ ముక్తులు | సాలోక్య, సామీప్య, సారూప్య, సాయుజ్యములు. |
| చతుర్విధ ప్రమాణములు | ప్రత్యక్ష, అనుమాన, ఉపమాన, శబ్దములు. |
| చతుర్విధ అంతఃకరణలు | మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారములు. |
| చతుర్విధ రథకులు | మహారథుడు, అతిరథుడు, సమరథుడు, అర్ధరథుడు. |
| చతుర్విధ బలములు | రథములు, గజములు, తురగములు, పదాతులు. |
| చతుర్విధోపాయములు | సామము, దానము, భేదము, దండము. |

| | |
|---|---|
| పురుషజాతి చతుష్టయము | భద్రుడు, దత్తుడు, కూచిమారుడు, పాంచాలుడు. |
| స్త్రీజాతి చతుష్యము | పద్మిని, హస్తిని, చిత్తిని, శంఖిని. |
| వయోవస్థా చతుష్యము | బాల్యము, యౌవనము, కౌమారము, వార్థక్యము. |
| చతురాశ్రమములు | బ్రహ్మచర్యము, గార్హస్థ్యము, వానప్రస్థము, సన్న్యాసము. |
| కావ్యవృత్తి చతుష్టయము | కైశికి, ఆరభటి, సాత్వతి, భారతి. |

## ౫ సంఖ్యలు గలవి

| | |
|---|---|
| పంచ భూతముల | పృథ్వి, అగ్ని, తేజస్సు, వాయువు, ఆకాశము. |
| జ్ఞానేంద్రియపంచకము | ఘ్రాణేంద్రియము, రసనేంద్రియము, చక్షురింద్రియము, త్వగింద్రియము, శ్రోత్రేంద్రియము. |
| కర్మేంద్రియపంచకము | వాక్కు, పాణి, పాదము, పాయువు, ఉపస్థ. |
| పంచ కావ్యములు | రఘువంశము, కుమారసంభవము, మేఘసందేశము, శిశుపాలవధ, కృష్ణార్జునీయము. |
| పంచ మహాకావ్యములు | మనుచరిత్ర, వసుచరిత్ర, రాఘవ పాండవీయము, పాండురంగ మహాత్మ్యము, శృంగార నైషధము. |
| పంచ కన్యలు | అహల్య, తార, ద్రౌపది, మండోదరి, సీత. |
| పంచారామములు | అమరారామము, కుమారారామము, క్షీరారామము, ద్రాక్షారామము, భీమారామము. |
| పంచాయతన దేవతలు | అంబిక, ఆదిత్యుడు, గణపతి, మహేశ్వరుడు, విష్ణువు. |
| పంచ ముఖములు | అఘోరము, ఈశాన్యము, తత్పురుషము, వామదేవము, సద్యోజాతము. |
| పంచ పల్లవములు | జువ్వి, మర్రి, మామిడి, మేడి, రావి. |
| పంచ వర్ణములు | ఆకుపచ్చ, ఎరుపు, తెలుపు, నలుపు, పసుపు. |
| పంచ పర్వములు | కృష్ణపక్షాష్టమి, కృష్ణపక్ష చతుర్దశి, అమావాస్య, పూర్ణిమ, సంక్రాంతి. |
| పంచ మహాపాతకములు | స్వర్ణస్తేయము, సురాపానము, బ్రహ్మహత్య, గురుపత్నీ గమనము, మహాపాతక సహవాసము. |
| పంచ ప్రాణములు | ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము, సమానము. |
| పంచోపవాయువులు | నాగము, కూర్మము, కృకరము, దేవదత్తము, ధనంజయము. |
| పంచభక్ష్యములు | భక్ష్యము, భోజ్యము, లేహ్యము, చోష్యము, పానీయము. |
| పంచగంగలు | కావేరి, కృష్ణవేణి, గౌతమి (గోదావరి), తుంగభద్ర, భాగీరథి. |
| మాతృపంచకము | రాజుభార్య, అన్న భార్య, గురువుభార్య, భార్యనుకన్న తల్లి, తన్నుకన్న తల్లి. |
| పితృపంచకము | తన్నుకన్నవాడు, తనకు ఉపనయనము చేసినవాడు, చదువు చెప్పిన గురువు, విపత్తునందు అన్నముపెట్టి కాపాడినవాడు, ఆపదలందు అభయమిచ్చి కాపాడినవాడు. |
| పంచాంగములు | తిథి, వార, నక్షత్ర, యోగ, కరణములు. |
| విష్ణుదేవుని పంచాయుధములు | శంఖం, చక్రము, గద, ఖడ్గము, శార్ఙ్గము. |
| పంచగవ్యములు | గోమూత్రము, గోమయము, గోఘృతము, గోదధి, గోక్షీరము. |

| | |
|---|---|
| పంచామృతములు | పాలు, ఉదకము, పెరుగు, నేయి, తేనె. |
| పంచ పాండవులు | ధర్మరాజు, భీముడు, అర్జునుడు, నకులుడు, సహాదేవుడు. |
| పంచ మహాకవులు | భారవి, కాళిదాసు, భవభూతి, మాఘుడు, హర్షుడు. |
| పంచకర్మలు | ఆయుర్వేదము - వమనము, రేచన, అనువాసన, నిరూహ, నస్యము.<br>తర్కము - ఉత్తేపణి, అవక్షేపణ, ఆకుంచన, ప్రసారణ, గమనములు.<br>పంచకూలకషాయము - పిప్పళ్ళు, పిప్పలిదుబ్బులు, శేవ్యము, చిత్రకము, శొంఠి వీటి కషాయము. |
| పంచతంత్రము | మిత్రలాభము, మిత్రభేదము, సంధి - విగ్రహము, లబ్ధనాశము, అసంప్రేక్ష్యకారిత్వము. |
| పంచ మకారములు | మత్స్య, మాంస, మధు, ముద్రా, మైధునములు. |
| పంచ రత్నములు | వజ్ర, మౌక్తిక, మాణిక్య, నీల, మరకతములు. |
| పంచ లోహములు | బంగారు, వెండి, ఇత్తడి, కంచు, ఇనుము. |
| పంచాక్షరి | న, మ, శి, వా, య. |
| పంచ ఉపపాండవులు | ప్రతి వింధ్య, శుతసోమ, శుతకీర్తి, శతానీక, శ్రుతసేనులు. |
| పంచ మహాయజ్ఞములు | బ్రహ్మయజ్ఞము, దేవయజ్ఞము, పితృయజ్ఞము, నరయజ్ఞము, భూతయజ్ఞము. |

## ౬ సంఖ్యలు గలవి

| | |
|---|---|
| షణ్మతములు | శైవము, వైష్ణవము, శాక్తము, గాణాపత్యము, సౌరము, కాపాలము. |
| షడ్రసములు | లవణము, ఆమ్లము, కటువు, మధురము, చేదు, త్రికము. |
| అరిషడ్వర్గములు | కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము. |
| షట్చక్రములు | మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూస, ఆహిత, విశుద్ధ, హంక్షములు. |
| షట్కర్మములు | యజనము, యాజనము, అధ్యయనము, అధ్యాపనము, దానము, ప్రతిగ్రహము. |
| షడీతిబాధలు | అతివృష్టి, అనావృష్టి, మిడుతలు, పందికొక్కులు, చిలుకలు, సన్నిహితరాజులు. |
| షట్చాస్త్రములు | తర్కశాస్త్రము, వ్యాకరణము, వైద్యశాస్త్రము, జ్యోతిషశాస్త్రము, మీమాంస. |
| షడ్గుణములు | సంధి చేసికొనుట, కలహించుట, యుద్ధమునకుబోవుట, యుద్ధకాలమునకు యెదురుజూచుట, భేదపఱుచుట, బలవంతులనాశ్రయించుట. (సంధి విగ్రహము, యానము, ఆసనము, ద్వైతము, ఆశ్రయము) |
| షడ్గుణైశ్వర్యములు | జ్ఞానము, ధైర్యము, మహాత్మ్యము, యశస్సు, శ్రీ, వైరాగ్యము. |
| షట్చక్రవర్తులు | ॥ శ్లోకము ॥<br>హరిశ్చంద్రోనలోరాజాపురుకుత్సః పురూరవః ।<br>సగరః కార్తవీర్యశ్చ షడేతేచక్రవర్తినః ॥<br>హరిశ్చంద్రుడు, నలుడు, పురుకుత్సుఁడు, పరూరవుడు, సగరుడు, కార్తవీర్యార్జునుడు. |

## ౭ సంఖ్యలు గలవి

| | |
|---|---|
| సప్తవ్యసనములు | జూదమాడుట, స్త్రీలగోరుట, మద్యపానము, వేటాడుట, కఠినపుమాటలాడుట, పరులసొమ్మును అపహరించుట, పరులను నిందించుట. |
| సప్తసంతానములు | తటాక ప్రతిష్ఠ, ధననిక్షేపము, అగ్రహారప్రతిష్ఠ, దేవాలయప్రతిష్ఠ, వనప్రతిష్ఠ, ప్రబంధనిర్మాణము, సత్త్రప్రతిష్ఠ. |
| సప్తకులపర్వతములు | హిమవంతము, నిషధము, వింధ్యము, మాల్యవంతము, పారియాత్రము, గంధమాదనము, హేమకూటము. |
| సభాసప్తాంగములు | కవీశ్వరులు, విద్వాంసులు, పౌరాణికులు, పూర్వకథల జెప్పెడివారు, స్తుతిపాఠకులు, హాస్యకరులు, గాయకులు. |
| సప్తవిధకవులు | ఆర్థి, భూషణార్థి, మార్దవానుగతుడు, రౌచికుడు, వాచకుడు, వివేకి, శిల్పకుడు. |
| సప్తర్షులు | అత్రి, కశ్యపుడు, గౌతముడు, జమదగ్ని, భరద్వాజుడు, వశిష్ఠుడు, విశ్వామిత్రుడు. |
| సప్త సముద్రములు | ఇక్షు, క్షీర, ఘృత, జల, దధి, లవణ, సురాసముద్రము. |
| సప్తద్వీపములు | కుశ, క్రౌంచ, జంబూ, పుష్కర, ప్లక్ష, శాక, శాల్మల ద్వీపములు. |
| సప్తమాతృకలు | ఇంద్రాణి, కౌమారి, చాముండి, బ్రాహ్మి, మహేశ్వరి, వారాహి, వైష్ణవి. |
| సప్తవర్షములు | ఇలావృత్త, కేతుమాల, కురు, భద్రాశ్వ, భారత, రమ్యక, హైరణ్యక. |
| సప్తఅధోలోకములు | అతల, వితల, సుతల, తలాతల, రసాతల, మహాతల, పాతాళములు. |
| సప్తభువనములు | భూలోక, భువర్లోక, స్వర్లోక, మహర్లోక, జనలోక, తపోలోక, సత్యలోకములు. |

## ౮ సంఖ్యలు గలవి

| | |
|---|---|
| అష్టైశ్వర్యములు | దాసీజనము, భృత్యులు, పుత్రులు, మిత్రులు, బంధువులు, వాహనములు, ధనము, ధాన్యము. |
| అష్టభోగములు | అన్నము, వస్త్రము, గంధము, పుష్పము, పానుపు, తాంబూలము, స్త్రీ, గానము. |
| అష్టకష్టములు | దాస్యము, దారిద్ర్యము, భార్యలేకుండుట, స్వయంకృషి లేకుండుట, యాచించుట, అడిగిన లేదనుట, అప్పుపడుట, త్రోవనడచుట. |
| అష్టసిద్ధులు | అణిమ (పరమాణు రూపము), మహిమ (విరాడ్రూపము), గరిమ (బ్రహ్మాండాదుల కంటె బరువుగా), లఘిమ (దూదివలె), ప్రాప్తి (వలయు వస్తువు లభింపజేసికొనుట), ప్రాకామ్యము (ఆకాశ సంచారము), ఈశత్వము (సమస్తముకు అధికారి), వశత్వము (సమస్తభూతజాలమును వశపఱచుకొనుట). |
| అష్టవసువులు | వరుణుడు, వృషభుడు, నహుషుడు, జయుడు, అనిలుడు, విష్ణువు, ప్రభాసుడు, ప్రత్యూషుడు. పాఠాంతరము - ఆపుఁడు, ధ్రువుడు, సోముడు, అథర్వుడు, అనిలుడు, ప్రత్యూషుడు, అనలుడు, ప్రభాసుడు. |
| అష్టగంధములు | కర్పూరము, కస్తూరి, పునుగు, జవ్వాజి, అగరు, పన్నీరు, అత్తరు, శ్రీగంధము. |
| అష్టావధానము | చతురంగము, కవిత్వము, వ్రాయుట, చదువుట, గణితము, సంగీతము, యుక్తి చెప్పుట, వ్యస్తాక్షరి. |
| అష్టదిగ్గజములు | ఐరావతము, పుండరీకము, వామనము, కుముదము, అంజనము, పుష్పదంతము, సార్వభౌమము. |

| | |
|---|---|
| అష్టదిగ్గజముల భార్యలు | అభ్రము, కపిల, పింగల, అనుపమ, తామ్రవర్ణి, శుభ్రదంతి, అంగన, అంజనావతి. |
| అష్టదిగ్గజములు | అల్లసాని పెద్దన, అయ్యలరాజు రామభద్రుడు, తెనాలి రామకృష్ణుడు, ధూర్జటి, నంది తిమ్మన, పింగళి సూరన, భట్టుమూర్తి, మాదయగారి మల్లన. |
| అష్టమహిషులు | కాళింది, జాంబవతి, భద్ర, మిత్రవింద, రుక్మిణి, లక్షణ, సత్యభామ, సుదంత (ఈ ఎనమండుగురు శ్రీకృష్ణునిభార్యలు). |
| అష్టలక్ష్మి | ఆదిలక్ష్మి, ధాన్యలక్ష్మి, ధైర్యలక్ష్మి, గజలక్ష్మి, సంతానలక్ష్మి, విజయలక్ష్మి, విద్యాలక్ష్మి, ధనలక్ష్మి. |
| అష్టాంగపూజ | రంగవల్లి (ముగ్గు), సుగంధము, అక్షతలు, పుష్పములు, ధూపము, దీపము, ఉపహారము (నైవేద్యము), తాంబూలము. |
| అష్టవిధ వివాహములు | బ్రాహ్మము (కన్యాదానము), దైవము, ఆర్షము, ప్రాజాపత్యము, రాక్షసము, అసురము (కన్యాశుల్కము లేదా ఓలి యిచ్చి చేయుట), గాంధర్వము (ప్రేమ వివాహము), పైశాచికము (బలాత్కారము) - ఇది అందరికి నింద్యము. |
| అష్టవిధనాయికలు | స్వాధీనపతిక (చెప్పినట్లువిని కోరినట్లు నడచు మగడుగలది), వాసవసజ్జిక (ప్రియుని రాకకై పడకగదిని అలంకరించునది), విరహోత్కంఠిత (సంకేత స్థలమునకు ప్రియుడు రాలేదని విరహవేదనపడు స్త్రీ), విప్రలబ్ధ (ప్రియునిచే వంచింపబడి రాయబారము పంపునది), ఖండిత (భర్తయందు పరస్త్రీ గమనముజూచి ఈర్ష్యపడునది), కలహాంతరిత (భర్తను అవమానించి పశ్చాత్తాపపడునది), ప్రోషిత భర్తృక (దేశాటనముజేయు భర్తను తలచుకొనునది), అభిసారిక (చక్కగా అలంకరించుకొని ప్రియుని కోసం సంకేత స్థలమునకు బోవునది). |
| అష్టవిధమదములు | అన్న, అర్థ, స్త్రీ, విద్యా, కుల, రూప, ఉద్యోగ, యౌవన మదములు. |
| అష్టాక్షరి | ఓం నమో నారాయణాయ. |
| అష్టధాతువులు | బంగారు, వెండి, రాగి, ఇనుము, తగరము, తుత్తునాగము, సీసము, కంచు. |
| అష్టాంగమార్గములు | మంచి భావనము, మంచి భాషణము, మంచి యోచనము, మంచి జీవనము, మంచి ధ్యానము, మంచి నిర్ణయము, మంచి నడక (శీలము), ఆత్మపరిశీలనము. ఇవి గౌతమబుద్ధుని బోధల సారము. |
| అష్టగురువులు | అక్షరాభ్యాసము, ఉపనయనము, వేదాధ్యయనము, ధర్మసంప్రదాయములు, పురాణేతిహాసములు, టక్కుటమార గజకర్ణ గోకర్ణ ఇంద్రజాల మహేంద్రజాల జాలాది విద్యలను ఉపదేశించిన, బ్రహ్మజ్ఞానోపదేశము చేయించినవారు. |

## ౯ సంఖ్యలు గలవి

| | |
|---|---|
| నవబ్రహ్మలు | మరీచి, భరద్వాజుడు, అంగీరసుడు, పులస్త్యుడు, పులహుడు, క్రతువు, దక్షుడు, వసిష్ఠుడు, వామదేవుడు. |
| నవభక్తులు | పరీక్షిత్తు, నారదుడు, ప్రహ్లాదుడు, భార్గవి, పృథుడు, అక్రూరుడు, గరుత్మంతుడు, ధనంజయుడు, బలి చక్రవర్తి. |

| | |
|---|---|
| నవవిధ స్థాయీభావములు | రతి, ఉత్సాహము, శోకము, అచ్చెరువు, నవ్వు, భయము, జుగుప్స, శమము, రోషము. |
| నవ గోప్యములు | ఆయుష్షు, ధనము, గృహచ్ఛిద్రము, మంత్రము, ఔషధము, మైథునము, దానము, మానము, అవమానము. |
| నవ కావ్యగుణములు | శ్లేష, మాధుర్యము, సౌకుమారము, సమత, అరార్థదీపనము, కాంతి, ఔదార్యము, ఓజస్సు, సమాధి. |
| నవవిధ ప్రేమోదయావస్థలు | శ్రద్ధ, సాధు సంగము, భజన, క్రియ, అనర్థనివృత్తి, నిష్ఠ, రుచి, ఆసక్తి, భావము, ప్రేమ. |
| నవ ఆత్మగుణములు | సుఖము, దుఃఖము, ఇచ్ఛ, ద్వేషము, ప్రయత్నము, ధర్మము, అధర్మము, సంస్కారము. |
| నవధాన్యములు | వడ్లు (ధాన్యము), ఉలవలు, పెసలు, మినుములు, నువ్వులు, గోధుమలు, అనుములు, కందులు, సెనగలు. |
| నవనిధులు | పహాపద్మము, పద్మము, శంఖము, మకరము, కచ్ఛపము, ముకుందము, కుందము, నీలము, రవము. |
| నవరత్నములు | వజ్రము, వైఢూర్యము, గోమేధికము, పుష్యరాగము, మరకతము, మాణిక్యము, నీలము, ప్రవాళము (పగడము), ముత్యము. |
| నవరంధ్రములు | చెవులు రెండు, నేత్రములు రెండు, నాసారంధ్రములు రెండు, నోరు, మలమూత్ర రంధ్రములు రెండు. |
| నవవిధభక్తులు | అర్చనము, ఆత్మ నివేదనము, కీర్తనము, దాస్యము, పాదసేవనము, వందనము, శ్రవణము, సఖ్యము, స్మరణము. |
| నవరసములు | శృంగార, హాస్య, కరుణ, రౌద్ర, వీర, భయానక, భీభత్స, అద్భుత, శాంత రసములు. |
| నవగ్రహములు | సూర్యుడు, చంద్రుడు, అంగారకుడు, బుధుడు, బృహస్పతి, శుక్రుడు, శని, రాహువు, కేతువు. |

## ౧౦ సంఖ్యలు గలవి

| | |
|---|---|
| దశదానములు | గోదానము, భూదానము, తిలదానము, హిరణ్య దానము, వస్త్ర దానము, ఘృతదానము, ధనదానము, ధాన్యదానము, గుడదానము, లవణదానము. |
| దశరూపకములు | అంకము, ఈహామృగము, డిమము, నాటకము, ప్రకరణము, ప్రహసనము, భాణము, వ్యాయోగము, వీథి, సమవాకారము. |
| దశవిధ కావ్యగుణములు | అర్థవ్యక్తి, ఓజస్సు, ఔదార్యము, ప్రసాదము, కాంతి, మాధుర్యము, శ్లేషము, సమత, సమాధి, సౌకుమార్యము. |
| దశోపనిషత్తులు | ఈశాన్య, ఐతరేయ, కఠ, కేన, ఛాందోగ్య, తైత్తిరీయ, ప్రశ్న, బృహదారణ్యక, మాండూక్య, ముండక ఉపనిషత్తులు. |
| దశావతారములు | ‖ శ్లోకము ‖<br>మత్స్య కూర్మవరాహశ్చ నారసింహశ్చ ।<br>వామనః రామోరాశ్చరామశ్చబుధకల్కిరేవచ ‖ |

(పాఠ్యాంతరములు - బుద్ధావతారమునకు బదులు శ్రీకృష్ణావతారము ఉంది)

మన్మథదశావస్థలు — కనులతో చూచుట, మనసుపడుట, సంకల్పించుట, నిద్ర పట్టకుండుట, చిక్కిపోవుట, అన్నిట విసిగు పుట్టుట, సిగ్గు విడుచుట, చిత్తభ్రమనొందుట, మూర్ఛనొందుట, ఆత్మహత్యకు యత్నించుట.

## ౧౧ సంఖ్యలు గలవి

ఏకాదశ రుద్రులు — ఉగ్రుడు, సోముడు, శర్వుడు, మృగవ్యాథుడు, రంతిజుడు, భీక్షుడు, అహిర్బుధ్న్యుడు, పినాకి, పాదుకేశ్వరుడు, కాపాలికేయుడు, భౌముడు.

## ౧౨ సంఖ్యలు గలవి

ద్వాదశాదిత్యులు — ఆర్యముడు, మిత్రుడు, అరణుడు, అర్కుడు, భగుడు, ఇంద్రుడు, వివస్వంతుడు, పూషుదు, పర్జన్యుడు, త్వష్ట, విష్ణువు, అజఘన్యుడు.

## ౧౩ సంఖ్యలు గలవి

త్రయోదశ తత్త్వములు — రాగము, ద్వేషము, కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము, ఈర్ష్య, అసూయ, దర్పము, డంభము, అహంకారము.

## ౧౪ సంఖ్యలు గలవి

చతుర్దశ మనువులు — స్వాయంభువ, స్వారోచిష, ఉత్తమ, తామసి, రైవత, చాక్షుష, వైవస్వత, సూర్య సావర్ణిక, దక్ష సావర్ణిక, బ్రహ్మ సావర్ణిక, రుద్ర సావర్ణిక, ధర్మ సావర్ణిక, భౌచ్య మనువులు.

చతుర్దశవిద్యలు — ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వవేదము, శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము, మీమాంసా శాస్త్రము, న్యాయ శాస్త్రము, పురాణము, ధర్మశాస్త్రము.

చతుర్దశ భువనములు — సప్త అధోలోకములు, సప్త ఊర్ధ్వలోకములు.

## ౧౬ సంఖ్యలు గలవి

షోడశోపచారములు — ఆవాహనము, ఆసనము, పాద్యము, అర్ఘ్యము, ఆచమనీయము, స్నానము, వస్త్రము, యజ్ఞోపవీతము, గంధము, పుష్పము, ధూపము, దీపము, నైవేద్యము, తాంబూలము, ప్రదక్షిణము, నమస్కారము.

షోడశకర్మములు — గర్భాదానము, పుంసవనము, సీమంతము, జాతకర్మము, నామకరణము, అన్నప్రాశనము, చౌలము, ఉపనయనము, ప్రాజాపత్యము, సౌమ్యము, అగ్నేయము, వైశ్వదేవము, గోదానము, సమావర్తనము, వివాహము, అంత్యకర్మములు.

| | |
|---|---|
| షోడశమహారాజులు | ॥ శ్లోకము ॥<br>గయోఽంబరీషో శశిబింద్వనంగౌ ।<br>పృథుర్మరుత్వన్మరుతౌ సుహోత్రః ।<br>రామౌ దిలీపో నృగరంతిదేవౌ ।<br>యయాతి మాంధాతృ భగీరథాశ్చ ॥<br><br>గయుడు, అంబరీషుడు, శశిబిందువు, అనంగుడు, పృథువు, మరుత్వంతుడు, మరుత్తు, సుహోత్రుడు, పరశురాముడు, శ్రీరాముడు, దిలీపుడు, నృగుడు, యయాతి, మాంధాత, భగీరథుడు. |
| షోడశ సంపదలు | కీర్తి, విద్య, బలము, జయము, పుత్రులు, స్వర్ణము, ధాన్యము, సత్కాలక్షేపము, అదోభజనము, జ్ఞానము, సౌందర్యము, క్షమ, బాల్యము, ధైర్యము, అరోగత, నిరాయువు. |

## ౧౮ సంఖ్యలు గలవి

| | |
|---|---|
| అష్టాదశ పురాణములు | బ్రహ్మము, పాద్మము, వైష్ణవము, శైవము, భాగవతము, భవిష్యోత్తరము, నారదీయము, మార్కండేయము, ఆగ్నేయము, బ్రహ్మకైవర్తము, లైంగము, వారాహము, స్కాందము, గారుడము, వామనము, మాత్స్యము, కూర్మము, బ్రహ్మాండము. |
| అష్టాదశ ఉపపురాణములు | సనత్కుమారము, నారసింహము, స్కాందము, శివధర్మము, దౌర్వాసము, నారదీయము, కాపిలము, మానవము, ఔశనము, బ్రహ్మాండము, వారుణము, కౌశికము, లైంగము, సాంబము, సౌరము, పారాశరము, మారీచము, భార్గవము. |
| అష్టాదశ పర్వములు | ఆది, సభా, అరణ్య, విరాట, ఉద్యోగ, భీష్మ, ద్రోణ, కర్ణ, శల్య, సౌప్తిక, స్త్రీ, శాంతి, అనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణమనునవి మహాభారతమందలి పర్వములు. |

# వేదములు

ఋగ్వేద మనియు, యజుర్వేద మనియు, సామవేద మనియు, అథర్వవేద మనియు వేదములు నాల్గు. ఈ నాల్గు వేదములలోని మంత్రములు యజ్ఞమునందు వినియోగింపబడును.

## ఋగ్వేదము

పాదబద్ధమగు మంత్రములకు ఋక్కులని పేరు. ఈ వేదమునందట్టి మంత్రములే యుండుట వలన ఋగ్వేదమను పేరు వచ్చినది. ఈ వేదమునకు ౨౧ శాఖలు గలవు. ఈ ౨౧ శాఖలలో శాకలశాఖ మఱియు బాష్కలశాఖ యని రెండు శాఖలు మాత్రమే యిప్పు నిల్చియున్నవి. యజ్ఞసమయమునందు హవిర్భాగముల గ్రహించు నిమిత్తము హోతయను ఋత్విక్కి యీ వేదమంత్రములతో దేవతల నాహ్వానించును. కావున యీ వేదమునకు హౌత్రవేదమనియు పేరు గలదు. ఈ ఋగ్వేదము ౧౦ మండలములుగా విభజింపబడియున్నది. ఒక శాఖవారు ౮ అష్టకములగ విభజించియున్నారు.

## యజుర్వేదము

ఈ యజుర్వేదము కృష్ణ మనియు శుక్ల మనియు ద్వివిధము.

కృష్ణ యజుర్వేదమునకే తైత్తిరీయమని నామాంతరము గలదు. తిత్తిరియను పేరుగల ఆచార్యుడు శిష్య ప్రశిష్యులకు బోధించెను గావున తైత్తిరీయమను పేరు వచ్చినది. ఈ తైత్తిరీయ వేదమునకు కూడ సంహిత, బ్రాహ్మణము, అరణ్యకము అను మూడు భాగములు గలవు. ఈ సంహిత యందు ౮ అష్టకములు లేక కాండములు, ౪౪ ప్రశ్నలు లేక ప్రపాఠకములు, ౬౫౧ అనువాకములు, ౨౧౯౬ పంచాశత్తులు లేక పనసలు గలవు. ప్రతి పనసయందును ఏబది పదములుండును. అనువాకాంతమునందున్న పనసలకును, చిన్న యనువాకమునందున్న పనసలకును పదములు కొంచెము హెచ్చుతగ్గులుండును. దీనినే సంస్కృత భాషయందు పంచాశత్తు అని యందురు.

శుక్లయజుర్వేదమునకు వాజసనేయసంహిత యని నామాంతరము గలదు. ఈ వేదమునకు మాధ్యందిన మఱియు కాణ్వ యను ద్విశాఖలు గలవు. ఈ రెండు శాఖలవారిని మన దేశమునందు సామాన్యముగా ప్రథమ శాఖవారని చెప్పెదరు. ఈ శుక్లయజుర్వేదమునందు ౪౦ అధ్యాయములు గలవు. ఈ వేదమునకు శతపథ బ్రాహ్మణము అని పేరు గలదు. ఈ వేదమంత్రములతో అధ్వర్యుఁడను ఋత్వికు యజ్ఞమునందు హోమాది ప్రధాన కృత్యముల నాచరించును.

## సామవేదము

సామమనగా గానము. గానము చేయదగిన మంత్రములుగల వేదము గావున సామవేదమని పిలవబడుచున్నది. ఈ వేదమునకు ౧౦౦౦ శాఖలుండెను. కాని యిప్పుడు ఒకశాఖ మాత్రము నిలిచి యున్నది. యజ్ఞకాలమునందు ఉద్గాతయను ఋత్విక్కు యీవేదమంత్రములతో గానమొనర్చుచు దేవతలను స్తుతించును. కావున యీ వేదమునకు ఉద్గాతృ వేదమనియు నామాంతరము గలదు. ఈ వేదమునకు తాండ్యబ్రాహ్మణము మున్నగు బ్రాహ్మణ గ్రంథములు ౮ గలవు.

## అథర్వవేదము

అథర్వ వేదము ౨౧ కాండములుగా విభజింపబడియున్నది. పూర్వము యీ వేదమునకు తొమ్మిది శాఖలు ఉండెను. ఇప్పుడు ఒక్కశాఖయేయున్నది. బ్రహ్మయను ఋత్విక్కు అవశ్య మెఱుంగ వలసినవిధి ఈవేదమునందు ంలదు. కావున ఈ వేదమునకు బ్రహ్మవేదమనియు పేరుగలదు. ఇతర వేదములందు కంటె శాంతిక పౌష్టికకర్మలు ఈ వేదమునందధికముగా గలవు. ఈ వేదబ్రాహ్మణ గ్రంథమునకు గోపథ బ్రాహ్మణమని పేరు.

వేదమునందు సంహితయనియు బ్రాహ్మణ మనియు ప్రధానమయిన విభాగములు. సంహితయనగా మంత్రములు మాత్రముగల భాగము. బ్రాహ్మణమనగా అర్థగాంభీర్యము గల మంత్రముల యర్థమును వివరించునట్టిగాని మంత్రములు పఠించుచు చేయవలసిన పనినిగాని తెలియజేయునట్టి గ్రంథము. కృష్ణయజుర్వేదమునకు మాత్రము ఈ లక్షణము సరిపోదు.

౧. ఋగ్వేదమునకు ఆశ్వలాయన సాంఖ్యాయన సూత్రములును,
౨. కృష్ణయజుర్వేదమునకుఆపస్తంబ, బోధాయన, సత్యాషాఢ, హిరణ్య కేశీయ, మానవ, వైఖానస సూత్రములును,
శుక్లయజుర్వేదమునకు పారస్కర, కాత్యాయన సూత్రములును,
౩ సామవేదమునకు గోభిల ద్రాహ్యాయణాది సూత్రములును,
౪. అథర్వేదమునకు కౌశిక సూత్రమును ఇప్పుడు వ్యవహారములో గలవు.

ఆపస్తంబ సూత్రుడనగా కృష్ణయజుర్వేదనకు చెందినవాడనియు, వివాహోపనయనాదిసకలకర్మలు ఆపస్తంబమహర్షి చేసిన కల్పసూత్రము ననుసరించి జరిపించుకొనువాడనియు మనము గ్రహింపవలెను. ఆదినుండి మన మేదియో నొక వేదమునకు అందులోని విభాగమునకు చేరియుందుము. తరువాత మనము అట్లే యుండవలయుగాని మనయిష్టానుసారము వేదమునుగాని సూత్రమునుగాని మార్చుకొన వీలులేదు. ఇది ప్రాచీన కాలమునుండి సంక్రమించిన సంప్రదాయము.

## వేదాంగములు ౬

౧. శిక్ష:వేదములందలి అక్షరములను, స్వరములను ఉచ్చరించునట్టి ఱీతిని వివరించి చెప్పును.
౨. వ్యాకరణము:సుశబ్ద అపశబ్దముల బోధించునది.
౩. ఛందస్సు:మంత్రములందు గల కఠినపదములయొక్క భావమును బోధించును.
౪. నిరుక్తము:వేదమంత్రములందు గల కఠినపదములయొక్క భావమును బోధించును.
౫. జ్యోతిషము:ఆయా కాలములందు చేయవలసిన యజ్ఞాయాగాది విధులకు సంబంధించిన కాలవిశేషములను బోధించును.
౬. కల్పము:ఆయా మంత్రముల పఠించుచు చేయవలసిన కార్యక్రమమును చక్కగా బోధించును.

## ఉపాంగములు ౪

౧. ధర్మశాస్త్రము:ఇదు మను యాజ్ఞవల్క్యాది భేదములు గలిగియుండును.
౨. పురాణము:ఇది బ్రహ్మాది ౧౮ భేదములు గలది. వ్యాసకృతము.
౩. మీమాంస:ఇది జైమిని మహర్షి కృతము. దీనిపేరు పూర్వమీమాంస. ఉత్తరమీమాంస వ్యాసకృతము.
౪. న్యాయ (తర్క) శాస్త్రము:గౌతముడు, కణాదమహర్షియు యీ యుపాంగమును రచించిరి.

## కర్మలు

బ్రాహ్మణాది ద్విజాతులవారును చేయవలసిన మతసంబంధమయిన కర్మలు గృహ్యకర్మలనియు, శ్రౌత్రకర్మలనియు రెండు తెఱగులు.

గృహ్యకర్మములనగా గృహ్యసూత్రమునందు చేయవలసినవిగా చెప్పబడినవి. సాధారణముగా యివి గర్భాధానాది షోడశకర్మలు. నిత్యకర్మములనగా స్నానము, సంధ్యావందనము, ఔపాసనము, బ్రహ్మయజ్ఞము, వైశ్వదేవము, దేవతార్చనము, అతిథిపూజ అనునవి.

శ్రౌత్రకర్మములనగా దర్శపూర్ణమాసలు. ఆధారము, అగ్నిష్టోమీయపశుయాగము, అగ్నిష్టోమము మొదలగు వేదవిహితములగు కర్మలు. ఈ కర్మలు చేయునప్పుడు యజమానులకు ప్రధానముగ అధర్వుడు, హోత, ఉద్గాత, బ్రహ్మయను నలుగురు ఋత్విక్కులు సహాయులయి యుండవలయును.

## ఋత్వికులు

| | |
|---|---|
| అధర్వుడు | యజుర్వేదమమునందు చెప్పబడిన మంత్రముల పఠించుచు యజ్ఞమునండు చేయవలసిన హోమాది ప్రధానకృత్యముల నాచరించునట్టి ఋత్విక్కు. |
| హోత | ఋగ్వేదమంత్రములతో హోమకాలమునందు ఆయా దేవతల పిలుచునట్టి ఋత్విక్కు. |
| ఉద్గాత | హోమాదికాలమునందు ఆయాదేవతా సంతుష్టి కొఱకు సామవేదమంత్రములతో గానము చేయునట్టి ఋత్విక్కు. |
| బ్రహ్మ | ఋత్విక్కులు చేయునట్టియు, యజమానుడు చేయునట్టియు సకలకృత్యములను పరీక్షించుచు సాక్షీభూతుడై అనుజ్ఞనిచ్చునట్టి ఋత్విక్కు. |
| ఆగ్నీధ్రుడు | దేవతలకు ఇచ్చునట్టి చరుపురోడాశాది హవిస్సుల చేయుటకును, యితర పనులకును సహాయముజేయునట్టి ఋత్విక్కు. |

అగ్నిష్టోమము మొదలగు గొప్ప గొప్ప యజ్ఞములందు ఈ నలుగురు ఋత్విక్కులకు ముగ్గురేసి వంతున సహాయ ఋత్విక్కులుందురు. ఈ కర్మములయందు సామాన్యముగా చరుపురోడాశములనునవి ఆజ్యముతోపాటు దేవతలకు ప్రత్యేకముగా నొసంగుదురు. చరువనగా బియ్యముతో వండిన హోమ ద్రవ్యము. పురోశాడ మనగా బియ్యపు పిండితో కపాలమునందు (అనగా నిప్పుమీద కాచిన పెంకుల మీద) జక్కగా కాచి పక్వముగా చేయబడిన పిండిముద్ద.

| | |
|---|---|
| ఇష్టి | ఆహితాగ్ని యయినవాడు ప్రతి పాడ్యమియందును చేయవలసినపని. |
| స్రుక్కు | ముఖ్యములయిన హోమములను చేయునట్టి యజ్ఞపాత్రము. దీనిని కొయ్యతో చేయుదురు. |
| స్రువము | సామాన్యముగా యీ పాత్రముతో ప్రాయశ్చిత్తహోమామును చేయుదురు. |

ప్రాయశ్చిత్తము: ఒక పనిని చేయవలసిన కాలమునందు చేయకపోయినను చేయదగనిపనిని చేసినను కలుగుచున్న దోషమును పోగొట్టుకొనుటకయి చేయునట్టిపని.

| | |
|---|---|
| అహితాగ్ని | గార్హపత్యము, ఆహవనీయము, దక్షిణాగ్ని యను మూడుగ్నులను ఆధానము చేసినవాడు. |
| పాకయాజి | ఔపాసనవైశ్వదేవాది సప్తపాకయజ్ఞముల నాచరించినవాడు. |
| హవిర్యాజి | హవిర్యజ్ఞములగు సప్తహవిర్యజ్ఞముల నాచరించునవాడు. |
| సోమయాజి | సప్తసోమసంస్థల నాచరించినవాడు. |
| సోమిదమ్మ | సోమయాజియొక్క భార్య. |

# భూగోళ శాస్త్రము

భూగోళశాస్త్రము అనఁగా భూతలమున కనఁబడెడు దేశ సముద్రాదులను వివరించునది. భూమి గుండ్రముగా యుండి ధ్రువముల వద్ద కొద్దిగా ఒత్తబడి వున్నదని శాస్త్రజ్ఞులు కనిపెట్టియున్నారు. భూగోళమును రెండు సమాన అర్ధభాగములుగా విభజించి ఒకదానికి పూర్వార్ధ భాగమనియు రెండవ దానికి పశ్చిమార్ధ భాగమనియు పేరు పెట్టినారు. భూగోళము ఉత్తరము నుండి దక్షిణమునకు సుమారు ౭౯౨౦ కోసులు, తూర్పు నుండి పడమరకు ౭౯౨౬ కోసుల పొడవు కలదు. భూగోళము చుట్టుకొలత సుమారు ౨౫ వేల కోసులు వున్నదని శాస్త్రజ్ఞులు కనిపెట్టినారు.

భూగోళము మూడువంతులు నీటిని, ఒకవంతు నేలను కలిగియున్నది. భూమిని మరల ఏడు ఖండములుగా విభజించినారు. అవి ఆసియా, ఆఫ్రికా, ఆస్ట్రేలియా, ఐరోపా (యూరోప్), ఉత్తర అమెరికా, దక్షిణ అమెరికా, అంటార్కిటికా. జలభాగములలో ఐదు మహాసముద్రములుగలవు. అవి పసిఫిక్ మహాసముద్రము, హిందూ మహాసముద్రము, అట్లాంటిక్ మహాసముద్రము, ఆర్కిటిక్ మహాసముద్రము, అంటార్కిటిక్ మహాసముద్రము.

## విశ్వము

ఈ అనంత విశ్వములో కోట్ల కొలది నక్షత్రములు ఉన్నవి. ఇట్టి ప్రకాశవంతమైన నక్షత్రములలో సూర్యగోళము ఒకటి. నక్షత్రములు సూర్యగోళము కంటె చాల దూరముల వుండుటచే అవి మనకు చిన్నవిగ చుక్కలవలె కనబడుచున్నవి. సూర్యుని చుట్టు తిరుగు గ్రహములలో భూమి ఒకటి. భూమికాక బుధుడు, శుక్రుడు, అంగారకుడు, బృహస్పతి సూర్యుని చుట్టు తిరుగుచున్నవి. ఈ గ్రహముల చుట్టు మరికొన్ని చిన్న గ్రహములు తిరుగుచున్నవి.

రాహువు, కేతువు అనునవి ఛాయాగ్రహములు. చంద్రుడు భూమి చుట్టు తిరుగును. సూర్య మండలముతో చేరిన వీటన్నిటిని సౌరకుటుంబము అని అందురు. భూమి తన చుట్టు తాను తిరుగుచు సూర్యుని చుట్టు తిరుగుచున్నది. తన చుట్టు తాను తిరుగుట వలన పగలురాత్రులు సూర్యుని చుట్టు తిరుగుట వలన ఋతువులు ఏర్పడుచున్నవి. భూమి తన చుట్టు తాను తిరుగుటకు ౨౪ గంటలు లేదా ఒక దినము పట్టును. సూర్యుని చుట్టు తిరుగుటకు ౩౬౫ రోజుల ౫ గంటల ౫౦ నిమిషములు పట్టును. దీనిని మనము ఒక సంవత్సరము అని చెప్పుచుందుము.

## భారత దేశము

ఆసియా ఖండములోని పెద్ద భూభాగములో భరత ఖండము ఒకటి. దీనిని ఇండియా (భారత్) లేక హిందూదేశమని కూడా అందురు. భారతదేశ వైశాల్యము సుమారు ౩౨,౮౭,౨౬౩ చదరపు కిలోమీటర్లు. భారతదేశమునకు ఉత్తరమున హిమాలయ పర్వతములు, తూర్పున బంగాళాఖాతము దక్షిణమున హిందూ మహాసముద్రము, పశ్చిమమున అరేబియా సముద్రము ఎల్లలుగా ఉన్నవి. భారతదేశముయొక్క సముద్ర తీరము పొడవు ౭,౫౧౬.౫ కిలోమీటర్లు. భారతదేశము మధ్యలో వింధ్య పర్వతములున్నవి. ఈ వింధ్య పర్వతములకు ఉత్తరముననున్న దేశభాగమును ఉత్తర హిందూస్థానమనియు, దక్షిణముననున్న భాగమును దక్షిణహిందూస్థానమనియు అందురు. ఉత్తర హిందూస్థానములో సింధు, గంగ, యమున, బ్రహ్మపుత్ర, మహానది, నర్మద, తపతి ముఖ్యమైన నదులు. దక్షిణ హిందూస్థానములో గోదావరి, కృష్ణ, తుంగభద్ర, పెన్న, కావేరి, తామ్రపర్ణి అనునవి ముఖ్యమైన నదులు. భారతదేశములో హిందూ, మహమ్మదీయ, క్రైస్తవ, బౌద్ధ, జైన, సిక్కు మతములు ముఖ్యమైన మతములు.

భారతదేశ జనాభా ౧౯౯౧ లెక్కల ప్రకారము ౮౪ కోట్ల ౬౩ లక్షలు. వీరిలో పురుషులు ౪౪ కోట్ల ౫౨ లక్షలు మఱియు స్త్రీలు ౪౦ కోట్ల ౧౧ లక్షలు. బారత రాజ్యాంగము ఆమోదించిన ప్రాంతీయ భాషలి ౧౮. వాటిలో ముఖ్యమైనవి అవి హిందీ, బెంగాలీ, గుజరాతీ, ఒరియా, తెలుగు, తమిళము, కన్నడము, మళయాళము, మరాఠీ, రాజస్థానీ, మణిపురి, ఉర్దూ, కాశ్మీరీ, సంస్కృతము, అస్సామీ, సింధీ, కొంకిణి, నేపాలీ మొదలగునవి. భారతదేశములో అత్యధిక ప్రజలు మాటలాడు భాష హిందీ తఱువాత స్థానము తెలుగుది.

## భారతదేశ సంక్షిప్త చరిత్ర

మనదేశ చరిత్ర అనాదియైనది. సృష్ట్యాదినుండియే మనదేశము చరిత్రకెక్కినది. అప్పుడు మనదేశముండిన పెద్ద భూభాగమునకు జంబూద్వీపమని పేరు. అప్పుడు ధర్మమును ఏర్పాటుచేసిన మహాపురుషులు మనువులు. వారు పదునలుగురు. వారే మన సంఘమునకు మూలపురుషులు. కనుకనే మనకు మానవులను పేరు వచ్చినది.

ఆదికాలమున మనదేశమును పాలించిన వారిలో భరతుడు చాలా గొప్పవాడు. అతడు దేశమును ఏకచ్ఛత్రముగా ధర్మసమ్మతముగా ప్రజారంజకముగా పరిపాలించినందువలన మనదేశమునకు ఆయన పేరుతో భరతఖండమను పేరు కాలక్రమమున యేర్పడి అదియే స్థిరపడిపోయెను.

విశాలమైన ఈ ఖండము తర్వాత తర్వాత పరిపాలన సౌకర్యమునకై పెక్కు మండలములుగా విభజింపబడెను. ఒక్కొక్క మండలమునకు ఒక రాజు ఏర్పడెను. ఈ ఱీతిగా అనేకమంది రాజులేర్పడిరి. ఈ రాజులలో ముఖ్యముగా సూర్యవంశమువారని, చంద్రవంశమువారని రెండు రాజవంశములు ప్రసిద్ధిపొందెను. ఆ రాజులు ధర్మరక్షణమునకు కంకణము కట్టుకుని తమ జీవితమంతయు దానికే వినియోగించి కీర్తిపొందిరి.

అందు సూర్య వంశములో మాంధాత, హరిశ్చంద్రుడు, దశరథుడు, శ్రీరాముడు మొదలైన రాజులు మిక్కిలి ప్రసిద్ధినొందిరి. వారు రాజ్య విస్తరణకు పాటుపడినను ప్రజల జీవితము జోలికిపోక వారివారి ధర్మములను వారువారు సక్రమముగా ఆచరించునట్లు చూచుకొనుచుండిరి. చంద్రవంశములో యాదవులు, కౌరవులు, పాండవులు మొదలైనవారు లోకములో ధర్మస్థాపనకు పాటుపడిరి.

సూర్యవంశపు రాజులలో రఘుమహారాజు స్మరింపదగినవాడు. ఆయన సంపూర్ణ భూప్రదక్షిణము చేసెను. తర్వాత శ్రీరాముడు దక్షిణా పథమందంతట సంచారముచేసి దేశశాంతికి భంగము కలిగించుచుండిన రాక్షసులను సంహరించి సనాతన ధర్మ సంస్థాపనకు ఏర్పడుచుండిన విఘ్నములను తొలగించి ప్రజలకు సుఖసంతోషములు గలిగించెను. ఆయన రాజ్యములో ప్రజలందరు సుఖముగానుండిరి. కనుకనే యిప్పటికిని జనులు రామరాజ్యమను మాటను శ్రేష్ఠమైనదను అర్థములో వాడుచున్నారు. ఆ శ్రీరాముని చరిత్ర తెలుపునదే శ్రీమద్రామాయణము.

శ్రీరాముని తర్వాత కాలక్రమమున సూర్యవంశము యొక్క ప్రభావము తగ్గి చంద్రవంశము ప్రబలెను. దానిలో యాదవులు ఎన్నదగినవారు. యాదవులలో సుప్రసిద్ధుడు శ్రీకృష్ణుడు. చంద్రవంశములో భరతవంశము ప్రశిద్ధమైనది. చంద్రవంశమునకు చెందిన పాండవులు హిమాచలమునుండి సేతువు వరకు దేశమును ఏకఛత్రముగా ఏలిరి. అధర్మమును నాశనము చేసి ధర్మమును నిలుపుటకై శ్రీకృష్ణుడు పాండవులను చేరదీసి వారి మూలమున తన ఆశయములను సాధించెను. ఆ ప్రయత్నమల ఫలితమే మహాభారత యుద్ధము. మన ప్రాచీన ఇతిహాసములలో రామాయణము శ్రీరాముని చరితమును, భారతము పాండవుల చరితమును చక్కగా

తెలుపుచున్నవి. శ్రీకృష్ణుని చరిత్రను శ్రీమద్భాగవతము తెలుపుచున్నది. శ్రీకృష్ణుడు యుద్ధరంగమున అర్జుననకు భగవద్గీతనుపదేశించినాడు. ఇది ప్రపంచమునందలి అనేక భాషలలో అనువదింపబడి పవిత్రమైనదిగా భావింపబడినది.

మహాభారత యుద్ధమునకు తర్వాత కాలస్వభావమువలన మానవునిలో మార్పులేర్పడెను. తోడివారిపై ఈర్ష్య, అసూయ మొదలైనవి ప్రబలెను. స్వార్థము, అహంకారము వలన ఒకటైయుండిన దేశము అనేక స్వతంత్ర్య రాజ్యములుగా చీలెను.

కొన్నాళ్ళకు మగధరాజ్యము ప్రధానమందెను. అది క్రీ॥పూ॥ ౬, ౪ శతాబ్దముల కాలము. శిశునాగవంశ రాజులు మహావైభవముతో రాజ్యమేలిరి. వారిలో బింబిసారుడు మిక్కిలి ప్రసిద్ధిపొందినవాడు. శిశునఅగుల తర్వాత నందవంశమువారు ప్రబలులైరి. మౌర్యవంశపువాడైన చంద్రగుప్తుడు విశాల సామ్రాజ్యమును స్థాపించెను. అప్పటికి కొంతకాలము క్రిందటనే గ్రీకుదేశ ప్రభువు అలెగ్జాండరు పంజాబు పడమటి ప్రాంతము వరకు దండెత్తివచ్చి కొంత దేశమును ఆక్రమించుకొని యవన రాజ్యమును స్థాపించిపోయెను. చంద్రగుప్తుడు ఆ యవనులను పారద్రోలి తన రాజ్యమును ఆఫ్ఘనిస్తాన్, పారశీక దేశములవరకు వ్యాపింపజేసెను. అతని మనుమడైన అశోకుడు దక్షిణమున కావేరీ తీరమువరకు తన రాజ్యమును విస్తరింపజేసెను. అతడు ప్రజలకు చాల సహాయముచేసి కీర్తి సంపాదించెను. అతని పిమ్మట ఆ సామ్రాజ్యము క్షీణించెను. తర్వాత శుంగవంశమువారు, కణ్వులు, ఆంధ్రులు కొంతకాలము ప్రబలియుండిరి. ఈ మధ్యకాలములో విక్రమార్కుడు ఉజ్జయిని రాజధానిగా మాళవమును పాలించి శకజాతివారిని ఓడించుటచే శకారియై, శకపురుషుడై అనేక కథలకు నాయకుడై ప్రకాశించెను. ఇతని కాలము క్రీ॥పూ॥ మొదటి శతాబ్దము. ఇతనిని క్రీ॥శ॥ మొదటి శతాబ్దమున శాతవాహన వంశీయుడైన శాలివాహనుడు ఓడించి మరిక శకమునకు మూలపురుషుడాయెను. ఇతని పేరుతో ఏర్పడినదే శాలివాహన శకము.

తరువాత ఉత్తర హిందూస్థానమున గుప్తులు, దక్షిణ హిందూస్థానమున శాతవాహనులు, రాష్ట్రకూటులు, చోళులు, పాండ్యులు, పల్లవులు పాలింపజొచ్చిరి.

పదవ శతాబ్దమున ఉత్తరదేశములో చిన్న చిన్న రాజ్యములు ఐకమత్యము లేకుండ పరస్పరము పోట్లాడుకొనజొచ్చెను. ఈసాకు చూచుకొని మహమ్మదీయులు ప్రవేశించి క్రమముగా మహమ్మదీయ రాజ్యమును స్థాపించిరి.

విజయనగర సామ్రాజ్యము ఆంధ్రదేశమున ప్రముఖ స్థానము వహించినది. విజయనగర సామ్రాజ్య నిర్మాతలైన హరిహర బుక్కరాయ సోదరులును, వారికి ఆచార్యులైన శ్రీ విద్యారణ్యులవారును ఓరుగల్లుకు చెందిన ఆంధ్ర మహాపురుషులే.

చరిత్రపూర్వయుగము నుండి ఆంధ్రదేశము ప్రసిద్ధిని పొందినది. పురాణకాలమునందు ఆంధ్రశాతవాహనులు యావద్భారతమును పరిపాలించిన చక్రవర్తులు. తరువాత ఇక్ష్వాకులు, పల్లవులు, శాలంకాయనులు, ఆనందగోత్రులు, విష్ణుకుండినులు, చాళిక్యులు, రాష్ట్రకూటులు, గాంగులు, చాళుక్య చోళులు, కాకతీయులు, గజపతులు, ముసునూరి నాయకులు, రెడ్డిరాజులు ఆంధ్రదేశమును పాలించిన ప్రముఖ రాజన్యులు.

౧౫, ౧౬ శతాబ్దములలో దక్షిణదేశమున విజయనగర సామ్రాజ్యము గొపంపగా వృద్ధిపొందెను. విజయనగర సామ్రాజ్యపు రాజులలో ప్రసిద్ధి పొందినవాడు శ్రీకృష్ణదేవరాయలు. ఇతని కాలములో శిల్పము, సాహిత్యము, సంగీతము మొదలగు కళలు చాల వృద్ధిపొందెను. ఇతని ఆస్థానములో అష్టగిద్దజములు అను ఎనమండుగురు కవులు గలరు. వారిలో ముఖ్యుడు తెనాలి రామలింగడు. ఆంధ్రసామ్రాజ్య చరిత్రలో శ్రీకృష్ణదేవరాయల పరిపాలనా కాలము విశిష్టమైనదని చెప్పవచ్చును. శ్రీకృష్ణదేవరాయల తర్వాత ఈ సామ్రాజ్యము కూడ మహమ్మదీయుల దండయాత్రలతో క్షీణించిపోయెను. వీని శిథిలమును నేటికిని కర్ణాటక రాష్ట్రమునందలి

బళ్ళారి జిల్లాలోని హంపి యందు చూడవచ్చును.

౧౬, ౧౭ శతాద్బములలో దేశచరిత్రయందు మరొక ఘట్టమేర్పడెను. విదేశీయులైన పోర్చుగీసువారు, ఫ్రెంచివారు, ఆంగ్లేయులు భాగ్యవంతమైన మన దేశముపై కన్నువేసిరి. వ్యాపారము చేసికొను నెపముతో ఒకరొకరుగా మనదేశమునకు వచ్చిరి. ఆ సమయములో దేశములో అనేక రాజ్యములుండెను. వానిలో కొన్నటిని హిందువులు, కొన్నిటిని మహమ్మదీయులు పాలించుచుండిరి. వారు పరస్పరము పోట్లాడుకొనుచు ఆ విదేశీయులను సైనికసహాయము కోరజొచ్చిరి. వ్యాపారమునకై వచ్చిన విదేశీయులు ఈ అవకాశమును వినియోగించుకొని తమ తమ వ్యాపారాభివృద్ధితోబాటు రాజ్యమును కూడ సంపాదించుటకు ప్రయత్నములు చేసిరి. రాజ్యములను సంపాదించు విషయములో విదేశీయులు పరస్పరము యుద్ధములు చేసిరి. తుదకు ఆంగ్లేయులు జయించిరి. వారు తూర్పు ఇండియా కంపెనీ పేరుతో వర్తకములోనేగాక రాజ్యపాలనములోను విశేషశ్రద్ధ చూపనారంభించిరి. దేశములలోని రాజుల అంతఃకలహముల మూలమున వీరు క్రమముగా దేశమంతను తమ అధీనములోనికి తెచ్చుకొని, ఆసేతు హిమాచలము ఏకచ్ఛత్రముగా పరిపాలింపసాగిరి. అంతలో ఇంగ్లాండు రాణియైన విక్టోరియా మహారాణి తూర్పిండియా కంపెనీవారి అధికారమును, రాజ్యమును స్వాధీనము జేసికొనెను. అది మొదలుకొని ఆమె పేరిట రాజప్రతినిధులు మన దేశమున పరిపాలన సాగింపజొచ్చిరి.

ఆంగ్లేయుల పాలనలో మనకు తంతి, తపాల, రైళ్ళు మొదలైన సదుపాయములు ఏర్పడెను. కాని, వారు ఇంగ్లీషు భాషకే ప్రాముఖ్యమిచ్చి పాఠశాలలలోను దానికే ప్రాముఖ్యమిచ్చుటచే మన దేశభాషలకు, మాతృభాషయైన సంస్కృతమునకు క్రమముగా పలుకుబడి తగ్గెను. స్వాతంత్ర్యము సన్నగిల్లి పరతంత్ర దాస్యము ప్రబలెను. ఆంగ్లేయుల పెత్తనము ఎక్కువాయెను.

దేశములోని ఈ పరిస్థితులను గ్రహించి, మన పెద్దలు దేశమునకు స్వాతంత్ర్యము సంపాదించుటకై భారత జాతీయా కాంగ్రెసు అను సంస్థను స్థాపించిరి. వీరి అహింసాయుత పోరాటమువలన క్రమముగా మన దేశీయులకు రాజ్యాంగములో ప్రవేశము, పరిపాలనా సౌకర్యములు కొంతకు కొంత ఏర్పడజొచ్చెను. కాని, నిర్బంధము పూర్తిగా తొలగలేదు. ఇంతలో భారత జాతీయ కాంగ్రెసుకు పోటీగా మహమ్మదీయులు ముస్లిం లీగ్ అను సంస్థను స్థాపించిరి. ఇరుపక్షములవారు దేశీయ స్వాతంత్ర్యమే ప్రధానోద్దేశముగ కృషి చేయసాగిరి. దేశస్వాతంత్ర్యమునకై మన నాయకులు ఎన్నియో విధముల స్వాతంత్ర్య పోరాటము సలిపి, చెఱసాలలకు కూడ వెళ్ళి ఎన్నియో హింసలపాలైరి. ఇట్లుండ గాంధీ మహాత్ముడు కాంగ్రెసునకు సారథ్యము వహించి, అహింసా విధానమున సత్యాగ్రహము కొనసాగించి, ఎట్లయితేనేమి ఎట్టకేలకు రక్తపాతము లేకుండగనే ఆంగ్లేయులు మనకు స్వాతంత్ర్యము ఇచ్చి పోవునట్లు చేసెను.

౧౯౪౭ ఆగష్టు ౧౫వ తేదీనాడు మనకు స్వాతంత్ర్యము లభించెను. ముస్లిం లీగ్ వారు తమ జాతి వారికి ప్రత్యేక దేశము కావలెనని పట్టుపట్టుటచే మన అఖండ భారతదేశమును రెండు భాగములు చేసిరి. మహమ్మదీయులు ఎక్కువమంది గల ప్రదేశములను కలిపి పాకిస్తాన్ అను పేర ముస్లిం లీగ్ వారి ఆధిపత్యమునకు పోయెను. ౧౯౫౦ జనవరి ౨౬వ తేదీన మన దేశము సర్వస్వతంత్ర ప్రజాస్వామ్య గణతంత్రరాజ్యముగా రూపొందెను. ఆంగ్లేయ పరిపాలకులు మన దేశమును వదలి పోయిరి.

తఱువాత దేశములోని పెద్దలందరు కలిసి మనదేశమునకు ప్రత్యేక రాజ్యాంగమును నిర్ణయించిరి. దాని ప్రకారమే ఇప్పుడు పాలన సాగుచున్నది. మనదేశముయొక్క అధిపతిని రాష్ట్రపతి అందురు. ఆయన అధికారమును పరిపాలనా సౌకర్యమునకై వికేంద్రీకరణ చేసిరి. కొంత కేంద్రమునకు, మిగిలినది ఆయా రాష్ట్రములకు దాఖలు పరిచిరి. కొన్ని శాఖలు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వములక ఉమ్మడి అధికారము క్రింద గూడ ఉండును.

భారతదేశము మొత్తమునకు ఏర్పడినట్టిది కేంద్ర ప్రభుత్వము. దానికి అధిపతి రాష్ట్రపతి. ఆయన అయిదేండ్ల కొకమారు కేంద్ర శాసనసభ ఉభయ విభాగములందలి సభ్యులచే ఎన్నుకోబడును. కేంద్రములోని దిగువ సభను లోక్ సభ అనియు, ఎగువ సభను రాజ్య సభ అనియు అందురు.

రాష్ట్రపతికి పరిపాలనలో సలహాలిచ్చుటకు ఒక మంత్రివర్గమున్నది. దానికి పెద్ద ప్రధాని అనబడును. ప్రజాసభ అను దిగువసభ సభ్యులలో ఎక్కువమంది ఆదరించు ప్రధాన పక్షమేదో దాని నాయకుని ప్రధానిగా రాష్ట్రపతి నియమించును. ఈ కేంద్ర ప్రభుత్వమునకు లోబడి పరిపాలన సులువుగా సాగుటకై మనదేశమును అప్పుడు ౨౬ రాష్ట్రములుగా, ౬ కేంద్రపాలిత ప్రాంతములుగా విభజించినారు. రాష్ట్రమునకు ప్రధానాధిపతులు గవర్నర్లు, వారికి తోడుగా మంత్రివర్గములుండును. మంత్రివర్గములకు ముఖ్యమంత్రులు నాయకులై యుందురు. ప్రస్తుతము మనదేశమున ౨౮ రాష్ట్రములు, ౭ కేంద్రపాలిత ప్రాంతములు గలవు.

మంత్రివర్గ సభ్యులు శాసనసభకు బాధ్యులై యుందురు. వీరు శాసనసభ విశ్వాసమును ఎల్లప్పుడు కాపాడుకోవలెను. వీరి విశ్వాసమును కోలుపోయినప్పుడు వీరు మంత్రిపదవులనుండి తప్పుకోవలసి యుండును.

శాసనసభలు కొన్ని కొన్ని రాష్ట్రములకు రెండేసి వుండును. కొన్నింటికి ఒక్కటే వుండును. రెండేసి ఉన్నచోట ఒకదానిని దిగువసభ లేక విధానసభ అని ఇంకొక దానిని ఎగువసభ లేక విధానపరిషత్తు అని పిలుతురు.

అసెంబ్లీ అనికూడ పిలవబడు దిగువసభకు సభ్యులను రాష్ట్రములోని వయోజనులందరు కలిసి ఎన్నుకొందురు. ఈ సభ్యులు ఐదేండ్లు ఆ పదవిలో ఉందురు. ఈ సభకు ఒక అధ్యక్షుడు ఉండును. ఆయనను ఆంగ్లమున స్పీకర్ అందురు. ఈ సభను విధానసభ అని కూడ అందురు.

ఎగువసభను కౌన్సిలు లేదా విధానపరిషత్తు అందురు. ఇది శాశ్వతమైనది. రెండ్లేండ్లకొకసారి ఇందలి సభ్యులలో మూడింట ఒకవంతు మంది పదవీ విరమణ చేయుదురు. ఈ సభకు కూడా అధ్యక్షుడు ఉండును. ఆయనను ఛైర్మన్ అందురు.

రాష్ట్రప్రభుత్వమునందు సచివాలయం (సెక్రటేరియట్) కాక విద్యాశాఖ, పరిశ్రమశాఖ, వ్యవసాయశాఖ, ఆరోగ్యశాఖ మొదలైన అనేక శాఖలుండును. ఒక్కొక్క శాఖకు ఒక్కొక్క అధ్యక్షుడు ఉండును. వారు ఆయా శాఖల పంత్రుల అధికామునకు లోబడి తమ తమ పనులు సాగించుచు జిల్లాలోని వివిధ అధికారులకు ఉత్తర్వులు పంపుచుందురు.

ఇప్పటి రాష్ట్రములవారీ, జిల్లాలవారీ పరిపాలన ప్రాచీన కాలమున లేదు. గ్రామపరిపాలనయే అప్పుడెక్కువగా ఉండెను. అదియే పంచాయితీ పరిపాలన. ఈ పంచాయితీల పద్ధతినికూడా మనవారు ఇప్పటికిని వదలకుండ ఏదో రూపముగా అమలు జరుపుచున్నారు. పంచాయితీ పరిపాలనకు ముఖ్యసూత్రము ఊరిపెద్దల పెత్తనము. ఇందులో అధికారుల ప్రమేయము లేదు. అనగా ప్రజాస్వామ్యము ఇందులో పైచేయి వహించుచున్నమాట. ఈ ప్రకారముగానే మనవారు జిల్లాసంస్థలు, తాలూకాసంస్థలు ప్రవేశపెట్టిరి. నగరపాలకసంస్థలు, మహానగరపాలకసంస్థలు వచ్చెను. అవియే ఇప్పుడిప్పుడు దేశకాల పరిస్థితులను అనుసరించి జిల్లా ప్రజాపరిషత్తులు, రెవిన్యూ మండలములు, సమాజ వికాస కేంద్రములు మొదలైన పేర్లతో పనిచేయుచుందురు. అధికార పరిపాలనయు, ప్రజాప్రతినిధుల పరిపాలనయు సరిసమానముగా పనిచేయుచు ప్రజాసంక్షేమమునకు పాటుపడుచున్నవి. పంచాయితీలనగా ఆదిలో ఉండినట్లు ఐదుగురు ఊరిపెద్దల సంఘములన్నమాట. ఆసంఖ్య ఇప్పటి అవసరములనుబట్టి బాగుగా పెరిగిపోయినది. కాని, పేరు మాత్రము అట్లే నిలిచిపోయినది. గ్రామములోని చిన్న పంచాయితీలను గ్రామ పంచాయితీలందురు. ఆ

పంచాయితీలను కలిపి పంచాయితీ సమితులు అని యేర్పాటు చేసిరి. ౧౯౮౫ సం॥ నుండి పంచాయితీ సమితులు, తాలూకాల స్థానే రెవిన్యూ మండలములను ఏర్పాటుచేసిరి.

మండల ప్రాంతములోని వ్యవసాయము, చిన్న పరిశ్రమలు, అభివృద్ధి, విద్య, సాంఘిక సంక్షేమము మొదలైన పనుల నిర్వహణ మండలాధికారులకు అప్పగించబడినది.

జిల్లాలోని ప్రణాళికలో సమాజాభివృద్ధి, ఆహారము, వ్యవసాయము, విద్య, వైద్యము వగైరా పనులు జిల్లాప్రజాపరిషత్తు వారికి అప్పగించబడినవి.

మండలములు, జిల్లా ప్రజాపరిషత్తులు కాక ముఖ్యమైన పట్టణములో వాటి పరిపాలన కొరకు నగరపాలకసంస్థలు ఉన్నవి. నగరపాలకసంస్థలోని సభ్యులను ఆయా నగరపాలకసంస్థలోని వయోజనులు ఎన్నుకొందురు. ఆ సభ్యులను కౌన్సిలర్లు అందురు. వారి నాయకుని ఛైర్మన్ అందురు. నగరపాలకసంస్థ విధులను కమిషనర్ అను ఉద్యోగి నిర్వహించుచుండును. అటులనే మహానగరపాలకసంస్థల అధ్యక్షుడిని మేయర్ అందురు.

ఈ ప్రకారము గ్రామమములకు మండలములు, పట్టణములకు నగరపాలకసంస్థలు, జిల్లాలకు జిల్లా ప్రజా పరిషత్తులు వాటి వాటి అధ్యక్షుల నాయకత్వమున రాష్ట్ర పరిపాలనలు సాగుచున్నవి.

జిల్లాలలోని వయోజనులచే రాష్ట్ర శాసనసభ సభ్యులు ఎన్నుకోబడుదురు. వారు తమ నాయకుడగు ముఖ్యమంత్రిని ఎన్నుకొందురు. ముఖ్యమంత్రి నాయకత్వమున రాష్ట్ర పరిపాలన సాగుచున్నది.

ఆయా రాష్ట్రములలోని వయోజనులచే లోక్ సభకు ఎన్నకొభడినవారిని లోక్ సభ సభ్యులందురు. వీరు తమకు నాయకునిగా ప్రధానమంత్రిని ఎన్నుకొందురు. ప్రధానమంత్రి నాయకత్వమున దేశ పరిపాలన సాగుచున్నది. ౧౮ సంవత్సరముల వయస్సు పైబడిన వారికి ఓటు వేయు హక్కుగలదు.

## ఆంధ్రప్రదేశ్

మన రాష్ట్రము ఆంధ్రప్రదేశ్. మన రాష్ట్ర రాజధాని నగరము హైదరాబాదు. మన రాష్ట్ర వైశాల్యము ౨,౭౫,౦౪౫ చదరపు కిలోమీటర్లు. వైశాల్యము జనాభా బట్టి కూడా భారతదేశమున మన రాష్ట్రము ఐదవది. మన రాష్ట్ర జనాభా (౨౦౦౧ సంవత్సర లెక్కలు) ౭,౫౭,౨౭,౫౪౧. ఇందు స్త్రీలు ౩,౭౪,౪౦,౭౩౦ పురుషులు ౩,౮౨,౮౬,౮౧౧. జనసాంద్రత చదరపు కిలోమీటరునకు ౨౭౫. యావద్భారత సాంద్రత ౩౨౪. మన హైదరాబాదు నగరము భారతదేశమున పెద్దనగరములలో ఆరవది. తక్కినవి ముంబయి, కలకత్తా, ఢిల్లీ, చెన్నయ్, బెంగళూరు.

మన రాష్ట్రమున ప్రధానమైన భాష తెలుగు. భారతదేశమున హిందీ తరువాత ఎక్కువమంది మాట్లాడు భాష తెలుగు.

మన రాష్ట్రమున లక్షకు మించిన జనాభా గలిగిన పట్టణములు ౩౬. అవి వరుసగా హైదరాబాదు, విశాఖపట్టణము, విజయవాడ, వరంగల్లు, గుంటూరు, నెల్లూరు, రాజమండ్రి, కాకినాడ, నిజామాబాదు, కర్నూలు, రామగుండం, తిరుపతి, అనంతపురం, సికిందరాబాదు, కరీంనగర్, ఏలూరు, మచిలీపట్నం, విజయనగరం, ప్రొద్దుటూరు, ఖమ్మం, ఆదోని, చిత్తూరు, నంద్యాల, తెనాలి, ఒంగోలు, భీమవరం, మహబూబ్ నగర్, కడప, హిందుపూరం, గుంతకల్లు, గుడివాడ, నల్గొండ, శ్రీకాకుళం, ఆదిలాబాదు, ధర్మవరం, తాడేపల్లిగూడెం.

మన రాష్ట్రమునకు ఉత్తరమున ఒరిస్సా, జార్ఖండ్, మహారాష్ట్రములు, పడమర కర్ణాటక, మహారాష్ట్రములు, దక్షిణమున తమిళనాడు రాష్ట్రము, తూర్పున బంగాళాఖాతము గలవు. ఆంధ్రప్రదేశమున మొత్తము సముద్రతీరము నిడివి ౯౭౪ కిలోమీటర్లు.

మనకు సాధారణముగా మార్చి నెల నుండి జూనం నెలాఖరు వరకు వేసవి కాలము, జూలై నుండి అక్టోబరు వరకు వర్షాకాలము, నవంబరు నుండి ఫిబ్రవరి వరకు చలికాలము.

నైసర్గిక పరిస్థితిని బట్టి మన రాష్ట్రమును మూడు సహజ భాగములుగా ఘాగింపవచ్చును. అవి తూర్పుకనుమలు మఱియు ఇతర కొండ ప్రాంతములు, పీఠభూమి ప్రాంతము, తూర్పుతీర మైదానము.

ఆంధ్ర ప్రదేశమున ఉత్తర ప్రాంతమున గాలికొండలు, మహేంద్రగిరి పర్వతములు, పాలకొండలు, సింహాచల పర్వతములు, గోదావరి ప్రాంతమున పాపికొండలు, కృష్ణానది ప్రాంతమున నందికొండ, శ్రీశైల పర్వతములు, దక్షిణమున తిరుపతి కొండలు, పడమట సహ్యాద్రి పర్వతశ్రేణి గలవు. వీటిలో ౧౫౨౭.౬ మీటర్ల ఎత్తుగలిగిన మహేంద్రగిరి మిక్కిలి ఎత్తైన పర్వత శిఖరము. ౧౫౦౦ మీటర్లు ఎత్తు గలవి గాలికొండలందు గలవు.

ఈ పర్వత శ్రేణులలోను, నదీతీర ప్రాంతములలోను, శ్రీకాకుళము, విశాఖపట్టణము, తూర్పు, పశ్చిమ గోదావరి, కర్నూలు, కడప, వరంగల్లు, ఆదిలాబాదు, కరీంనగర్, మహబూబునగర్, నిజామాబాద్, ఖమ్మం జిల్లాలలోను దట్టమైన అడవులున్నవి.

మన రాష్ట్రమున వర్షపాతము సాలీన ౯౧౪.౪ సెంటీమీటర్లు.

మహా పవిత్రమైన పుష్కరనదులుగా భావింపబడుచున్న దివ్యనదులు గోదావరి, కృష్ణ, తుంగభద్ర గాక మన రాష్ట్రమున పెన్నానది, ప్రాణహిత, మంజీర, బహుద, వంశధార, సువర్ణముఖి, మూసి (ముచుకుంద), దుందుభి, పాలేరు మొదలగు నదులు కూడ కలవు.

మన రాష్ట్రమున విజయపురివద్ద కృష్ణానదిపై నాగార్జునసాగర్, పోచంపాడువద్ద గోదావరిపై పోచంపాడు (శ్రీరాంసాగర్) ఆనకట్టలు నిర్మించినారు. వీనినుండి కాలువల ద్వారా కొన్ని లక్షల ఎకరముల భూములకు నీటిపారుదల సౌకర్యము కలిగి కొన్ని లక్షల టన్నుల ఆహార ధాన్యములు పండుటకు వీలగుచున్నది. నాగార్జునసాగర్ వద్ద విద్యుచ్ఛక్తి కూడ ఉత్పత్తియగుచున్నది. శ్రీశైలంవద్ద కృష్ణా నదిపై నిర్మింపబడిన ఆనకట్టనుండి మన రాష్ట్రమునకు అధికముగా విద్యుచ్ఛక్తి లభించుటయేగాక రాయలసీమలో కొన్ని జిల్లాలళౌని భూములకు నీటిపారుదల సౌకర్యము లభించుచున్నది. మన రాష్ట్రమున నాగార్జునసాగర్, పోచంపాడు, శ్రీశైలం వంటి గొప్ప ఆనకట్టలే గాక శ్రీకాకుళం జిల్లాలో వంశధార నదిపై వంశధార ఆనకట్ట, నెల్లూరు వద్ద పెన్నానదిపై సోమశిల అనకట్ట మొదలగు యితర ఆనకట్టలు గలవు. ఎగువ, దిగువ సీలేరు, మాచ్ ఖండ్, నాగార్జునసాగర్ ఆనకట్టల నుండి, రామగుండం, క్రొత్తగూడెం, విజయవాడ, నెల్లూరు థర్మల్ కేంద్రములనుండి మన రాష్ట్రమునకు విద్యుచ్ఛక్తి లభించుచున్నది. రామగుండంవద్ద సూపర్ థర్మల్ స్టేషను నిర్మింపబడినది. దీనివలన మన రాష్ట్రమునకు అధికముగా విద్యుచ్ఛక్తి లభించుచున్నది. శ్రీశైలంవద్ద కృష్ణానది నుండి కాలువలద్వారా రాయలసీమ ప్రాంతమనకు నీటిపారిదల సౌకర్యము, తమిళనాడులోని చెన్నయి నగరమునకు త్రాగునీటి సౌకర్యము కొరకు తెలుగుగంగ ప్రాజెక్టు నిర్మించబడుచున్నది.

రాజమండ్రి (రాజమహేంద్రవరము)వద్ద గోదావరి నదిపైన రైలు వంతెన పొడవు ౯౦౩౬ అడుగులు. దీనికంటె పెద్ద వంతెన భారతదేశమున మరియొక్కటి మాత్రమే కలదు. శోణానదిపై కల ఆ వంతెన పొడవు ౧౦౦౫౨ అడుగులు. రాజమండ్రి వద్ద గోదావరిపై రైలు-రోడ్డు వంతెన నూతనముగా నిర్మింపబడినది.

ఆంధ్రప్రదేశమున మొత్తము ౫,౦౨౫.౬౭ కి.మీ. నిడివిగల రైలు మార్గములున్నవి. రోడ్డు మార్గములలోమనకు ౨౯౪౯ కి.మీ. నిడివిగల జాతీయ రహదారులు మరియు ౪౨,౫౧౧ కి.మీ. నిడివిగల రాష్ట్ర రహదారులు కలవు. ఇవిగాక ౧౯౩౦ కి.మీ. నీటి కాలువ రవాణాసౌకర్యము కలదు.

ఆంధ్రప్రదేశమున హయదరాబాదులోని చార్ మీనార్ ఎత్తైన కట్టడము. దీని ఎత్తు ౧౮౮ అడుగులు. దీనికంటె భారతదేశమున ఎత్తైన కట్టడములు ఢిల్లీలోని కుతుబ్ మీనార్ ముంబయి విశ్వవిద్యాలయ గోపురము, బీజాపూర్ గోల్ గుంబజ్ మాత్రమే.

ప్రపంచమున గొప్ప చిత్రవస్తు ప్రదర్శనశాలలలో నిక్కటైగు సాలార్‌జంగ్ సంగ్రహాలయము, గౌతమబుద్ధుని ఏకశిలా విగ్రహము హైదరాబాదు నగరమునందున్నవి.

విశాఖపట్టణము జిల్లాలోని అరకులోయ, చిత్తూరుజిల్లాలోని మదనపల్లె సమీపములోని హార్స్లీ కొండలు మన రాష్ట్రమున వేసవి విడిది కేంద్రములు.

హైదరాబాదు నగరమున చక్కని జంతు ప్రదర్శనశాల గలదు. ఇచ్చటనుండు జంతువులకు సహజ వాతావరణము కల్పించియున్నారు.

ఆంధ్రప్రదేశమున నాగార్జునకొండ, జగ్గయ్యపేట, అమరావతి బౌద్ధ స్థూపములకు రామప్పగుడి, ఓరుగల్లు, హనుమకొండ దేవాలయములు మొదలైనవి కాకతీయ శిల్పకళా సంప్రదాయమునకు, లేపాక్షి, తాడిపత్రి దేవాలయములు విజయనగర శిల్పకళా సంప్రదాయమునకు ప్రసిద్ధములు.

ఆంధ్రప్రదేశము జీవనదులచేత పవిత్రమైన రాష్ట్రమగుటవలన వ్యవసాయమిచ్చటి జనులకు ముఖ్యవృత్తి అయినది. వరి, చెఱకు, పొగాకు, నూనెగింజలు, ప్రత్తి, జొన్నలు ముఖ్యమైన పంటలు. పొగాకు పంటలో ఆంధ్రరాష్ట్రమునది దేశములో ప్రథమస్థానము. ఇచ్చట లభించు ఖనిజములలో నేలబొగ్గు, ఇనుము, రాగి, అల్యూమినియం, మాంగనీసు, అభ్రకము, గ్రాఫైట్, ముగ్గురాయి, సున్నపురాళ్ళు, తెల్లసుద్ద మూక్యమైనవి.

భారీ పరిశ్రమలలో చక్కెర, నూలు, సిమెంటు, జనపనార మిల్లులు, ఎరువుల తయారీ, నపకా నిర్మాణము, నూనెశుద్ధి కర్మాగారము, విద్యుచ్ఛక్తి పరికరములు, యంత్ర పరికరముల తయారీ, సిగరెట్ల తయారీ ముఖ్యమైనవి.

కుటీర పరిశ్రమలలో చేనేత, అల్లికపని, బొమ్మల తయారీ, బిద్రీపని, తోళ్ళ పరిశ్రమ, కుట్టుపని మొదలైనవి. ఆసియా ఖండమున అతిపెద్దదైన పంచదార మిల్లు మన రాష్ట్రమున నిజామాబాద్ వద్ద బోధన్ (శక్కర్ నగర్) నందున్నది.

ఆంధ్రప్రదేశములోని విశ్వవిద్యాలయములు: వాల్తేరులోని ఆంధ్ర విశ్వవిద్యాలయము, హైదరాబాదులోని ఉస్మానియా విశ్వవిద్యాలయము, వ్యవసాయ విశ్వవిద్యాలయము, కేంద్ర విశ్వవిద్యాలయము, సార్వత్రిక విశ్వవిద్యాలయము, తెలుగు విశ్వవిద్యాలయము, తిరుపతిలోని శ్రీవేఙ్కటేశ్వర విశ్వవిద్యాలయము, పద్మావతీ మహిళా విశ్వవిద్యాలయము, వరంగల్లులోని విశ్వవిద్యాలయము, గుంటూరులోని నాగార్జున విశ్వవిద్యాలయము, విజయవాడలోని వైద్య విశ్వవిద్యాలయము, పుట్టపర్తిలోని సత్యసాయి విశ్వవిద్యాలయము, అనంతపురములోని శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయము. ఈ విశ్వవిద్యాలయములకు అనుబంధముగా పెక్కు సాధారణ కళాశాలలు, వైద్య, సాంకేతిక మొదలగు వృత్తివిద్యా కళాశాలలు కలవు.

ఆంధ్రప్రదేశములో ఏడు రేడియా కేంద్రములున్నవి. ఇందు హైదరాబాదు, విజయవాడలందు ప్రసారకేంద్రములును, కడప,

విశాఖపట్టణము, ఓరుగల్లు, కర్నూలు, ఆదిలాబాదులందు రిలే కేంద్రములును కలవు.

ఆంధ్రప్రదేశమున పెక్కు పుణ్యక్షేత్రములున్నవి. ఇందు తిరుపతి, శ్రీశైలము, భద్రాచలము యావద్భారత ప్రఖ్యాతి గలవి. ఇవిగాక శ్రీకాళహస్తి, వేములవాడ, అన్నవరము, యాదగిరి, నాచగిరి, ద్రాక్షారామము, కోటప్పకొండ, అలంపురము, హనుమకొండ, జీడికల్లు, త్రిపురాంతకము, మహానంది, అరసవిల్లి, శ్రీముఖలింగం, అమరావతి, వేదాద్రి, ఒంటిమిట్ట, కీరపండరి, విజయవాడ, పుష్పగిరి, బ్రహ్మంగారి మఠం, శ్రీకూర్మం, బాసర, సింహాచలం మొదలైన పుణ్య క్షేత్రములు కలవు.

ఆంధ్రదేశము పరిపాలనా సౌలభ్యము కొరకు ౨౩ జిల్లాలుగా విభజింపబడినది. వీటిని మూడు ప్రధాన విభాగములుగా చేయవచ్చును, అవి కోస్తా లేదా సర్కారు జిల్లాలు, రాయలసీమ జిల్లాలు, తెలంగాణ జిల్లాలు.

శ్రీకాకుళము, విజయనగరము, విశాఖపట్టణము, తూర్పగోదావరి, పశ్చిమగోదావరి, కృష్ణా, గుంటూరు, ప్రకాశం మరియు నెల్లూరు జిల్లాలు కోస్తా విభాగములోనివి. చిత్తూరు, కడప, అనంతపురము మరియు కర్నూలు జిల్లాలు రాయలసీమ విభాగములోనివి. ఆదిలాబాదు, నిజామాబాదు, కరీంనగర్, మెదక్, రంగారెడ్డి, హైదరాబాదు, మహబూబునగర్, నల్గొండ, వరంగల్లు మరియు ఖమ్మం జిల్లాలు తెలంగాన విభాగములోనివి.

## జిల్లాల వివరములు

### శ్రీకాకుళం

| | |
|---|---|
| వైశాల్యము | ౫,౮౩౭.౦౦ చదరపు కిలోమీటర్లు. |
| జనాభా | ౨,౫౨౮.౪౯ వేలు (౨౦౦౧ లెక్కలు). |
| మండలములు ౩౮ | వీరఘట్టం, వంగర, రేగిడిఆముదాలవలస, రాజాం, గొంగువారి సింగడం, లావేరు, రణస్థలం, ఎచ్చెర్ల, పొందూరు, సంతకవిటి, బూర్జ, పాలకొండ, సీతంపేట, భామిని, కొత్తూరు, హిరమండలం, సరుబుజ్జిలి, ఆముదాలవలస, శ్రీకాకుళం, గార, పోలాకి, నరసన్నపేట, జాలమూరు, సావరకోట, పాటపట్నం, మెలియపుట్టి, టెక్కలి, కోటబొమ్మాళి, సంతబొమ్మాళి, నందిగామ, వజ్రపుకొత్తూరు, పలాస, మందస, సోంపేట, కంచిలి, కవిటి, ఇచ్ఛాపురం. |
| ముఖ్య నదులు | వంశధార, నాగావళి, మహేంద్రతనయ, వేదవతి, బహుదా. |
| ముఖ్య పంటలు | వరి, రాగులు, పెసలు, ఉలవలు, చెఱకు, జనుము, వేరుశెనగ, నువ్వులు, మిరప, పసుపు, నీరుల్లి. |
| ఖనిజములు | మాంగనీసు, గ్రాఫైట్, సున్నపురాయి. |
| ముఖ్య పరిశ్రమలు | చక్కెర, నూనె, జీడిపప్పు, జనపనార కర్మాగారములు. |

### విజయనగరము

| | |
|---|---|
| వైశాల్యము | ౬,౫౩౯ చదరపు కిలోమీటర్లు. |
| జనాభా | ౨,౨౪౫.౧౦ వేలు (౨౦౦౧ లెక్కలు) |
| మండలములు ౩౪ | కొమరాడ, గుమ్మలక్ష్మీపురం, కురుపాం, జియ్యమ్మవలస, గరుగుబిల్లి, పార్వతీపురం, మక్కువ, సీతానగరం, బలిజపేట, బొబ్బిలి, సాలూరు, పాచిపెంట, రామభద్రపురం, బాడంగి, తెర్లాం, మెరకముడిదాం, దత్తిరాజేరు, మెంటాడ, గజపతినగరం, బొండపల్లి, గుర్ల, గరివిడి, చీపురుపల్లి, నెల్లిమర్ల, పూసపాటిరేగ, భోగాపురం, డెంకాడ, విజయనగరం, గంట్యాడ, శృంగవరపుకోట, వేపాడ, లక్కవరపుకోట, జామి, కొత్తవలస. |
| ముఖ్య నదులు | చంపావతి, గోస్తనీ, శారద, నాగావళి, జంఝావతి, గోముఖి, సువర్ణముఖి, వేగవతి. |
| ముఖ్య పంటలు | రాగులు, సజ్జ, వరి, వేరుశెనగ, చెఱకు, నువ్వులు, ఉలవలు, గోగు. |
| ఖనిజములు | గ్రాఫైట్, మాంగనీసు, ఇనుము, అసిటైట్, అభ్రకము, బంకమన్ను. |
| ముఖ్య పరిశ్రమలు | ఫెర్రోమాంగనీసు, చక్కెర, జనపనార, నూలు. |

## విశాఖపట్టణము

| | |
|---|---|
| వైశాల్యము | ౧౧,౧౬౧ చదరపు కిలోమీటర్లు. |
| జనాభా | ౩,౭౮౯.౮౨ వేలు (౨౦౦౧ లెక్కలు) |
| మండలములు ౪౩ | ముంచింగిపుట్టు, పెదబయలు, హుకుంపేట, డుమ్ బ్రిగూడ, అరకులోయ, అనంతగిరి, దేవరపల్లి, చీడికడ, మాడిగుల, పాడేరు, గంగరాజు మాడుగుల, చింతపల్లి, గూడెంకొత్తవీధి, కొయ్యూరు, గోలుగొండ, నాతవరం, నర్సీపట్నం, రోలుగుంట, రావికమతం, బుచ్చయ్యపేట, చోడవరం, కె. కోటపాడు, సబ్బవరం, పెందుర్తి, ఆనందపురం, పద్మనాభం, భీమునిపట్నం, విశాఖపట్నం (పట్టణ), విశాఖపట్నం (గ్రామీణ), గాజువాక, పెదగంట్యాడ, పరవాడ, అనకాపల్లి, మునగపాక, కశింకోట, మాకవరపాలెం, కోటురట్ల, పాయకరావుపేట, నక్కపల్లి, యస్. రాయవరం, ఎలమంచిలి, రాంబిల్లి, అచ్యుతాపురం. |
| ముఖ్య నదులు | గోస్తని, వరాహ, శారద, తాండవ. |
| ముఖ్య పంటలు | వరి, సజ్జ, రాగులు, పెసలు, ఉలవలు, వేరుశెనగ, నువ్వులు, చెఱకు, జనుము, నీరుల్లి. |
| ఖనిజములు | గ్రాఫైట్, మాంగనీసు, ఇనుము. |
| ముఖ్య పరిశ్రమలు | బెల్లము, చక్కెర, జనపనార, ఎరువువలు, సిమెంటు, ఓడల నిర్మాణము, ఇంధన శుద్ధి కర్మాగారము, ఇక్కు కర్మాగారము మెదలగునవి. |

## తూర్పు గోదావరి

| | |
|---|---|
| వైశాల్యము | ౧౦,౮౦౭ చదరపు కిలోమీటర్లు. |
| జనాభా | ౪,౮౭౨.౬౨ వేలు (౨౦౦౧ లెక్కలు) |
| మండలములు ౫౭ | కాకినాడ, తాళ్ళరేవు, కాజులూరు, కరప, సామర్లకోట, పెదపూడి, పిఠాపురం, గొల్లప్రోలు, కొత్తపల్లి, ప్రత్తిపాడు, ఏలేశ్వరం, శంఖవరం, పెద్దాపురం, కిర్లంపూడి, జగ్గంపేట, గండేపల్లి, రంగంపేట, తుని, తొండంగి, కోటనందూరు, అడ్డతీగల, రాజవొమ్మంగి, వై. రామవరం, గంగవరం, రంపచోడవరం, మారేడుమిల్లి, రాజమండ్రి, రాజానగరం, కడియం, కోరుకొండ, గోకవరం, సీతానగరం, రాయవరం, బిక్కవోలు, అనపర్తి, రామచంద్రపురం, పామర్రు, అలమూరు, మండపేట, కపిలేశ్వరం, సఖినేటిపల్లి, మల్కిపురం, రాజోలు, మామిడికుదురు, పి.గన్నవరం, రావులపాలెం, ఆత్రేయపురం, కొత్తపేట, అంబాజీపేట, అమలాపురం, అల్లవరం, ఉప్పలగుప్పం, ఐనవల్లి, ముమ్మిడివరం, కాట్రేనికోన, ఐ.పోలవరం, దేవీపట్నం. |
| ముఖ్య నదులు | గోదావరి, ఏలేరు. |
| ఖనిజములు | గ్రాఫైట్, ఇనుము, పింగాణి మట్టి. |
| ముఖ్య పంటలు | వరి, మొక్కజొన్న, సజ్జ, ఉలవలు, పెసలు, మినుములు, మిరప, చెఱకు, పసుపు, నువ్వులు, నీరుల్లి, కొబ్బరి, మామిడి. |
| ముఖ్య పరిశ్రమలు | చక్కెర, నూనె, కాగితము, పేనాళు, తోళ్ళు, పట్టువస్త్రములు, బెల్లము, ఎరువులు. |

## పశ్చిమ గోదావరి

| | |
|---|---|
| వైశాల్యము | ౭,౭౪౨ చదరపు కిలోమీటర్లు. |
| జనాభా | ౩౭౯౬.౧౪ వేలు (౨౦౦౧ లెక్కలు) |
| మండలములు ౪౬ | ఏలూరు, పెదపాడు, పెదవేగి, భీమడోలు, వీరవాసరం, ఆకివీడు, కల్ల, ద్వారకా తిరుమల, దెందులూరు, చింతలపూడి, లింగపాలెం, కామవరపుకోట, టి.నర్సాపురం, తాడేపల్లిగూడెం, గణపవరం, నల్లజెర్ల, నిడమర్రు, ఉంగుటూరు, పెంటపాడు, కొవ్వూరు, చాగల్లు, నిడదవోలు, దేవరపల్లి, గోపాలపురం, తాళ్ళపూడి, పోలవరం, కొయ్యలగూడెం, గారెడ్డిగూడెం, బుట్టాయగూడెం, జీలుగుమిల్లి, తణుకు, ఇరగవరం, ఉండ్రాజవరం, అత్తిలి, పెనుమంట్ర, పెనుగొండ, పెరవలి, నర్సాపురం, మొగల్తూరు, యంమంచిలి, పాలకొల్లు, పోడూరు, ఆచంట, భీమవరం, పాలకోడేరు, ఉండి. |
| ముఖ్య నదులు | గోదావరి, ఎఱ్ఱకాల్వ, తమ్మిలేరు. |
| ముఖ్య పంటలు | వరి, జొన్న, ఉలవలు, పొగాకు, మిరప, పసుపు. |
| ఖనిజములు | గ్రాఫైట్, పింగాణి మట్టి. |
| ముఖ్య పరిశ్రమలు | చక్కెర, జనపనార, ఎరువులు, నూలుబట్టలు, తివాచీలు. |

## కృష్ణా

| | |
|---|---|
| వైశాల్యము | ౮,౭౨౭ చదరపు కిలోమీటర్లు. |
| జనాభా | ౪౨౧౮.౪౨ వేలు (౨౦౦౧ లెక్కలు) |
| మండలములు ౪౯ | మచిలీపట్టణము, గూడూరు, పెడన, కృత్తివెన్ను, బంటుమిల్లి, అవనిగడ్డ, నాగాయలంక, కోడూరు, మొవ్వ, చల్లపల్లి, ఘంటసాల, గుడివాడ, ముదినేపల్లి, నందిగామ, పెదపరుపూడి, గుడ్లవల్లేరు, పామర్రు, మండవల్లి, కైకలూరు, కలిదిండి, విజయవాడ (గ్రామీణ), విజయవాడ (పట్టణ), పెనమలూరు, ఇబ్రహీంపట్నం, జి.కొండూరు, కంచికచెర్ల, వీరుల్లపాడు, నందిగామ, పెనుగంచిప్రోలు, చందర్లపాడు, జగ్గయ్యపేట, వత్సవాయి, నూజివీడు, ఆకిరిపల్లి, మునునూరు, బొవులపాడు, గన్నవరం, ఉంగుటూరు, వుయ్యూరు, పమిటముక్కల, తోట్లవల్లూరు, విస్సన్నపేట, చట్రాయి, రెడ్డిగూడెం, కొండూరు, తిరువూరు, గంపలగూడెం. |
| ముఖ్య నదులు | కృష్ణా, బుడమేరు, మున్నేరు, తమ్మిలేరు. |
| ముఖ్య పంటలు | వరి, జొన్న, పెసలు, మినుములు, ఉలవలు, వేరుశెనగ, పొగాకు, చెఱకు, పసుపు. |
| ఖనిజములు | ఇనుము, గ్రాఫైట్. |
| ముఖ్య పరిశ్రమలు | చక్కెర, సిమెంటు, సబ్బులు. |

## గుంటూరు

| | |
|---|---|
| వైశాల్యము | ౧౧,౩౯౧ చదరపు కిలోమీటర్లు. |
| జనాభా | ౪,౪౦౫.౫౨ వేలు (౨౦౦౧ లెక్కలు) |
| మండలములు ౫౭ | గుంటూరు, వెల్దుర్తి, మాచెర్ల, దుర్గి, రెంటచింతల, చరుకుపల్లి, భట్టిప్రోలు, కారెంపూడి, గురజాల, దాచేపల్లి, మాచవరం, పిడుగురాళ్ళ, ఊపూరు, బోలపల్లి, వినుకొండ, నూజెండ్ల, శావల్యపురం (కనుమర్లపూడి), రొంపిచెర్ల, నకరికల్లు, నర్సరావుపేట, చిలకలూరిపేట, నాదెండ్ల, ఎడ్లపాడు, బెల్లంకొండ, రాజుపాలెం, క్రోసూరు, ముప్పాళ్ళ, అచ్చంపేట, పెదకూరపాడు, సత్తెనపల్లి, ఫిరంగిపురం, మేడికొండూరు, పెదకాకాని, ప్రత్తిపాడు, వట్టిచెరుకూరు, మంగళగిరి, తాడేపల్లి, తాళ్ళూరు, తాడికొండ, అమరావతి, దుగ్గిరాల, తెనాలి, వేమూరు, అమృతలూరు, కొల్లిమర, నుందూరు, చేబ్రోలు, కొల్లూరు, పొన్నూరు, పెదనందిపాడు, కాకు(క)మాను, బాపట్ల, పిట్టలవానిపాలెం, కర్లపాలెం, నగరం, నిజాంపట్నం, రేపల్లె. |
| ముఖ్య పంటలు | వరి, జొన్నలు, ప్రత్తి, పసుపు, మినుములు, పెసలు, మిరప, చెఱకు, నువ్వులు. |
| ముఖ్య ఖనిజములు | సున్నపురాయి. |

## ప్రకాశం

| | |
|---|---|
| వైశాల్యము | ౧౭,౬౨౬ చదరపు కిలోమీటర్లు. |
| జనాభా | ౩,౦౫౪.౯౪ వేలు (౨౦౦౧ లెక్కలు) |
| మండలములు ౫౬ | ఒంగోలు, టంగుటూరు, కొత్తపట్నం, నాగులుప్పలపాడు, చీమకుర్తి, మద్దిపాడు, సంతనూతలపాడు, అద్దంకి, కోరిసపాడు, జె.పంగులూరు, పల్లికురవ, సంతమాగులూరు, మార్టూరు, యుద్దనపూడి, చీరాల, వేటపాలెం, చినగంజాం, పరుచూరు, ఇంకొల్లు, కారంచేడు, కందుకూరు, గుడ్లూరు, ఓలేటివారిపాలెం, పొన్నలూరు, కొండపి, జరుగుమల్లి(ళ్ళి), సింగరాయకొండ, ఉలవపాడు, లింగసముద్రం, కనిగిరి, తిమ్మారెడ్డిపల్లి (హనుమంతునిపాడు), మాపూరు, వెలిగండ్ల, చంద్రశేఖరపురం, పెదచెర్లోపల్లి(ళ్ళి), పొదిలి, కొనకనమిట్ల, మఱ్ఱిపాడు, దర్శి, తాళ్ళూరు, ముండ్లమూరు, దొనకొండ, తర్లుపాడు, మార్కాపురం, డోర్నాల, పెదఅరవాడు, కురిచేడు, యఱ్ఱగొండపాలెం, త్రిపురాంతకం, పుల్లలచెరువు, గిద్దలూరు, రాచెర్ల, కొమరోలు, బెస్తవారిపేట, కంభం, అర్ధవీడు. |
| ముఖ్య నదులు | గుండ్లకమ్మ, పాలేరు, మూసీ (ముచుకుంద), మున్నేరు. |
| ముఖ్య పంటలు | వరి, జొన్న, మొక్కజొన్న, సజ్జ, పెసలు, మినుములు, పసుపు, పొగాకు, వేరుశెనగ, మిరప, ప్రత్తి, జనుము. |
| ఖనిజములు | సున్నపురాయి, పలకరాయి, గ్రాఫైటు. |
| మూఖ్య పరిశ్రమలు | నూలు, పొగాకు, తోళ్ళు, పలకల తయారీ, కట్టడపు రాయి. |

## నెల్లూరు

| | |
|---|---|
| వైశాల్యము | ౧౩,౦౭౬ చదరపు కిలోమీటర్లు. |
| జనాభా | ౨౬౬౮.౬౬ వేలు (౨౦౦౧ లెక్కలు) |
| మండలములు ४౬ | నెల్లూరు, సీతారాంపురం, ఉదయగిరి, వరికుంటపాడు, దత్తలూరు, మర్రిపాడు, వింజమూరు, కలిగిరి, కొండాపురం, కావలి, జలదంకి, విడవలూరు, బోగోలు, కోవూరు, దగదర్తి, అల్లూరు, బుచ్చిరెడ్డిపాలెం, దొరవారిసత్రము, సంగం, ఆత్మకూరు, అనుమ సముద్రంపేట, కొడవలూరు, దక్కిలి, అనంతసాగరం, ఇందుకూరుపేట, తోటపల్లిగూడూరు, వెంకటాచలం, ముత్తుకూరు, పొదలకూరు, చేజెర్ల, కలువాయి, రాపూరు, సైదాపురం, గూడూరు, మనుబోలు, చిల్లకూరు, వాకాడు, కోట, చింతమూరు, నాయుడుపేట, పెళ్ళకూరు, బిజిలి, సూళ్ళూరుపేట, తడ, వెంకటగిరి, బాలాయపల్లి. |
| ముఖ్య నదులు | పెన్న, కందలేరు, మున్నేరు, స్వర్ణముఖి, ఉప్పుటేరు. |
| ముఖ్య పంటలు | వరి, జొన్న, సజ్జ, ఉలవలు, ఆముదాలు, ప్రత్తి, మిరప, రాగులు. |
| ఖనిజములు | అభ్రకము, రాగి, ఇనుము, టాల్క్, జిప్సం, పింగాణి మట్టి. |

## చిత్తూరు

| | |
|---|---|
| వైశాల్యము | ౧౫,౧౫౨ చదరపు కిలోమీటర్లు. |
| జనాభా | ౩౭౩౫.౨౦ వేలు (౨౦౦౧ లెక్కలు) |
| మండలములు ౬౬ | చిత్తూరు, గిడిపాల, యాదమర్రి, గంగాధరనెల్లూరు, పూతలపట్టు, పెనుమూరు, బంగారుపాలెం, తవనంపల్లి, ఊరాల, శ్రీరంగరాజపురం, పాచికపాలెం, కమ్మపల్లి, వడమాలపేట, పాల సముద్రము, పుత్తూరు, కార్వేటినగరం, నారాయణవరం, నగరి, నింఢ్ర, విజయపురం, చంద్రగిరి, పాకాల, పులిచెర్ల, తిరుపతి (పట్టణ), తిరుపతి (గ్రామీణ), రేణిగుంట, శ్రీకాళహస్తి, ఏర్పేడు, తొట్టంబేడు, బుచ్చినాయుడుకండ్రిగ, కోవనూరు, సత్యవేడు, వరదయ్యపాలెం, నాగలాపురం, పిచ్చాటూరు, మదనపల్లి, నిమ్మలపల్లె, కురబలకోట్ల, బి.కొత్తపేట, పెద్దమాండ్యం, తంబళ్ళపల్లె, పెద్దతిప్పసముద్రం, ములకలచెరువు వాయల్పాడు, గుఱ్ఱంకొండ, కలకడ, కలికిరి, పీలేరు, ఎఱ్ఱవారిపాలెం, చిన్నగొట్టిగల్లు, రొంపిచెర్ల, కంబంవారిపల్లె, పుంగనూరు, చౌడేపల్లి, రామసముద్రము, సొదం, సోమాల, పెద్దపంజాని, పలమనేరు, గంగవరం, బైరెడ్డిపల్లి, వెంకటగిరికోట, రామకుప్పం, గూడుపల్లి, శాంతిపురం, కుప్పం. |
| ముఖ్య నదులు | స్వర్ణముఖి, పాపఘ్ని, పింఛా, బాహుదా, ఆరణి. |
| ముఖ్య పంటలు | వరి, రాగులు, సజ్జలు, జొన్న, వేరుశెనగ, చెఱకు, మామిడి. |
| ఖనిజములు | కట్టడపురాయి, ఇనుము. |
| ముఖ్య పరిశ్రమలు | చక్కెర, బెల్లం, నూలు, మోటారు సైకిళ్ళు. |

## కడప

| | |
|---|---|
| వైశాల్యము | ౧౫,౩౫౯ చదరపు కిలోమీటర్లు. |
| జనాభా | ౨,౫౭౩.౪౮ వేలు (౨౦౦౧ లెక్కలు) |
| మండలములు ౫౦ | కడప, చెన్నూరు, ఖాజీపేట, వల్లూరు, పెండ్లిమఱ్ఱి, చింతకొమ్మదిన్నె, రాయచోటి, చిన్నమండెం, తండుపల్లి, సంబేపల్లి, వెరవలి, లక్కిరెడ్డిపల్లి, చక్రాయపేట, గాలివీడు, రామాపురం, కమలాపురం, ఎర్రగుంట్ల, వీరనాయునిపల్లి, కోడూరు, చిట్వేలు, ఓబులివారిపల్లి, పుల్లంపేట, రాజంపేట, నందలురు, పెనగలూరు, సిద్ధవటం, ఒంటిమిట్ట, అట్లూరు, బద్వేలు, గోపవరం, పోరుమామిళ్ళ, కలసపాడు, బి.కోడూరు, బ్రహ్మంగారిమఠం, జమ్మలమడుగు, ముద్దనూరు, కొండాపురం, పులివెందుల, సింహాద్రిపురం, లింగాల, తొండూరు, వేంపల్లి, వేముల, ప్రొద్దుటూరు, రాజుపాలెం, చాపాడు, యస్.మైదుకూరు, దువ్వూరు, పెద్ద మడియం, మైలవరం. |
| ముఖ్య నదులు | పెన్న, పాపఘ్ని, సగిలేరు, కుందేరు (కుముద్వతి), చెయ్యేరు, చిత్రావతి. |
| ముఖ్య పంటలు | జొన్న, వరి, సజ్జ, కొఱ్ఱలు, ఉలవలు, వేరుశెనగ, నీరుల్లి, ప్రత్తి, మిరప, నువ్వులు. |
| ఖనిజములు | ముగ్గురాయి, ఇనుము, సున్నపురాయి, కడపరాయి, పింగాణిమట్టి, రాతినార. |
| ముఖ్య పరిశ్రమలు | ముగ్గురాయి, పండ్ల పరిశ్రమ, నూలు, చీరలు. |

## అనంతపురం

| | |
|---|---|
| వైశాల్యము | ౧౯,౧౩౦ చదరపు కిలోమీటర్లు. |
| జనాభా | ౩౬,౩౮,౩౯౪ (౨౦౦౧ లెక్కలు) |
| మండలములు ౬౩ | అనంతపురం, రత్తాడు, గార్లదిన్నె, ఆత్మకూరు, కూడేరు, సింగనమల, బుక్కరాయసముద్రము, నార్పల తాడిపత్రి, యాడికి, పుట్లూరు, పెద్దవప్పూరు, ఎల్లనూరు, గుంతకల్లు, గుత్తి, పామిడి, పెద్దవడుగూరు, ఉరవకొండ, వజ్రకరూరు, విడపనకల్లు, ధర్మవరం, తాడిమిఱ్ఱి, బడ్లపల్లి, చెన్నే కొత్తపల్లి, కనగానపల్లి, రామగిరి, కల్యాణదుర్గం, బెళగుప్ప, కంబదూరు, కుందుర్తి, బ్రహ్మసముద్రము, సెట్టూరు, రాయదుర్గం, బి.హరెహల్లు, గుమ్మగట్ట, కణేకల్లు, బొమ్మనకల్లు, పెనుగొండ, సోమందిపల్లి, రొద్దం, పుట్టపర్తి, కొత్తచెరువు, బుక్కపట్నం, మడకశిర, అమరాపురం, గుడిబండ, రోళ్ళ, ఆగలి, హిందూపురం, పరిగి, లేపాక్షి, గోరంట్ల, చిలమత్తూరు, కదిరి, ముదిగుబ్బ, నల్లమడ, నంబులి పులికుంట, తలుపుల, నల్లచెరువు, ఓబుల దేవరచెరువు, తనకల్లు, అమడగూడూరు, గాండ్లపెంట. |
| ముఖ్య నదులు | పెన్నా, చిత్రావతి, వేదవతి. |
| ముఖ్య పంటలు | కొఱ్ఱలు, జొన్న, వరి, రాగులు, ఉలవలు, కందులు, వేరుశెనగ, నువ్వులు, ప్రత్తి, చెఱకు, నీరుల్లి. |
| ఖనిజములు | ఇనుము, ముగ్గురాయి, సున్నపురాయి, వజ్రములు. |
| ముఖ్య పరిశ్రమలు | నూలు, పట్టువస్త్రములు, ఉన్ని, బెల్లము. |

## కర్నూలు

వైశాల్యము ౧౭,౬౮౮ చదరపు కిలోమీటర్లు.

జనాభా ౩౫,౧౨,౨౬౬ (౨౦౦౧ లెక్కలు)

మండలములు ౫౪ కర్నూలు, నంద్యాల, మహానంది (తిమ్మాపురం), బండి ఆత్మకూరు, పాణ్యం, గడివేముల, ఆళ్ళగడ్డ, రుద్రవరం, శిరువెళ్ళ, చాగలమఱ్ఱి, కోస్పాడు, కోయిలకుంట్ల, దొర్నిపాడు, ఉయ్యాలవాడ, సంజామల, కొలిమిగుండ్ల, బనగానపల్లి, ఔకు, ఆత్మకూరు, వెలుగోడు, పాములపాడు, కొత్తపల్లి, శ్రీశైలం(సుండిపెంట), నందికొట్కూరు, ముడుతూరు, పగిడాల, జోపాడుబంగ్లా, గూడూరు, కోడుమూరు, సి.బెలగల్లు, ద్రోణాచలం, బేతంచెర్ల, వెల్దుర్తి, కృష్ణగిరి, ప్యాపిలి, కల్లూరు, ఓర్వకల్లు, ఆదోని, కోసిగి, కౌతాళం, నందవరం, మంత్రాలయం, ఆలూరు, చిప్పగిరి, ఆస్పరి, హోలగుండ, హాలహర్వి, పత్తికొండ, దేవనకొండ, తుగ్గలి, మద్దికెర, గోనెగండ్ల.

ముఖ్య నదులు తుంగభద్ర, హందజరి, కృష్ణ, కుందేరు.

ముఖ్య పంటలు వరి, జొన్న, కందులు, నువ్వులు, వేరుశెనగ, ఆముదాలు.

ఖనిజములు సీసము, ముగ్గురాయి, సున్నపురాయి, హేమటైటు, తెల్లసుద్ద.

ముఖ్య పరిశ్రమలు నూలు, సిమెంటు, ఉన్ని, వనస్పతి, కాగితము.

## మహబూబునగర్

వైశాల్యము ౧౮,౪౩౨ చదరపు కిలోమీటర్లు.

జనాభా ౩౫౦౬౮౭౬ (౨౦౦౧ లెక్కలు)

మండలములు ౬౪ మహబూబునగర్, కొడంగల్, మద్దూరు, దౌలతాబాదు, బొమ్రాసుపేట, కోసిగి, దామరగిద్ద, ముక్తల్, నారాయణపేట, ఉట్కూరు, ధన్వాడ, ,ఆగనూరు, కోయిలకొండ, నవాబుపేట (ఎన్మనెగండ్ల), హన్వాడ, జడ్చర్ల, బాలానగర్, భూత్ పూర్ (భూతపురి), ఫరూక్ నగర్ (షాద్ నగర్), కేశంపేట, కొందుర్గ్, కొత్తూరు, ఆమనగల్లు, కల్వకుర్తి, వెల్దండ, వంగూరు, మాడ్గుల, మిడ్జిల్, తలకొండపల్లి, నాగర్ కర్నూలు, తిమ్మాజిపేట, బిజినేపల్లి, గోపాల్ పేట, తెల్కపల్లి, తాడూర్, కొత్తకోట, వనపర్తి, పెబ్బేరు, ఘనపూర్, పెద్ద మందడి, అడ్డాకుల, ఆత్మకూరు, దేవరకద్ర, చిన్నచింతకుంట, ఐజ, గద్వాల, ధరూర్, మల్దకల్లు, గట్టు, అలంపూర్, వడ్డేపల్లి (శాంతినగర్), మానవపాడ్, ఇటిక్యాల, కొల్లాపూర్, పెద్దకొత్తపల్లి, కోడేరు, పానగల్లు, వీపనగండ్ల, అచ్చంపేట, అమరాబాదు, లింగాల, బాల్మూరు, నర్వ, ఉప్పునూతల.

ముఖ్య నదులు దిండి (దుందుభి), కృష్ణా, తుంగభద్ర, పెద్దవాగు.

ముఖ్య పంటలు జొన్న, వరి, సజ్జ, వరిగెలు, రాగులు, ఉలవలు, కందులు, మిరప, వేరుశేనగ, ఆముదాలు, కుసుమలు, ప్రత్తి.

ఖనిజములు పింగాణిమట్టి.

## నల్గొండ

వైశాల్యము ౧౪,౨౪౦ చదరపు కిలోమీటర్లు.

జనాభా ౩౨,౩౮,౪౪౯ (౨౦౦౧ లెక్కలు)

మండలములు ౫౯ నల్గొండ, యాదగిరిగుట్ట, ఆలేరు, రాజంపేట, తుర్కపల్లి, భువనగిరి, గుండాల, బొమ్మలరామారం, భూదాన్ పోచంపల్లి, బీబీనగర్, రామన్నపేట, వలిగొండ, చౌటుప్పల్, మాతూర్కు, ఆత్మకూర్, తుంగతుర్తి, తిరుమలగిరి, నూతనకల్లు, అర్వపల్లి (జాజిరెడ్డినగర్), సూర్యాపేట, పెన్ పహాడ్, మోతే, చివ్వెంల, నక్రేకల్, కొత్తపల్లి, సాలిగౌరారం, కట్టంగూరు, చందూర్, మనుగోడ్, నారాయణపూర్, నార్కట్ పల్లి, కనగల్, తిప్పర్తి, చిట్యాల, నాంపల్లి, చింతపల్లి, గుఱ్ఱంపోడ్, మఱ్ఱిగూడ, దేవరకొండ, పెద్దఅడిసెర్లపల్లి, చందంపేట, గుండ్లపల్లి, నిడువూనూరు, పెద్దమూర, హాలియా (అనమల), త్రిపురారం, మిర్యాలగూడ, దామరచెర్ల, వేములపల్లి, హుజూర్ నగర్, నేరెడచెర్ల, గరిడేపల్లి, మఠంపల్లి, కోదాడ, మేళ్ళచెఱువు, చిలుకూరు, నడిగూడెం, మునగాల.

ముఖ్య నదులు కృష్ణా, మూసీ (ముచుకుంద), ఆలేరు, పల్లేరు, పెద్దవాగు, దిండీ (దుందుభి).

ముఖ్య పంటలు వరి, జొన్న, సజ్జ, పప్పుధాన్యములు, నూనెగింజలు, కుసుమలు, ప్రత్తి.

ఖనిజములు పింగాణిమట్టి.

పట్టు, తోళ్ళపరిశ్రమ, ఉన్నినేత, బెల్లము.

## హైదరాబాదు

వైశాల్యము ౨౧౭ చదరపు కిలోమీటర్లు.

జనాభా ౩౬,౮౬,౪౬౦ (౨౦౦౧ లెక్కలు)

మండలములు ౫౯ సికింద్రాబాదు, ముషీరాబాదు, గోల్కొండ, చార్మినార్.

ముఖ్య నది మూసీ (ముచుకుంద).

ముఖ్య పరిశ్రమలు రాష్ట్రరాజధాని నగరమగుటచే అనేక పరిశ్రమలు, పరిశ్రమల వాడలు యీ జిల్లాయందు గలవు.

## రంగారెడ్డి

వైశాల్యము ౭,౪౯౩ చదరపు కిలోమీటర్లు.

జనాభా ౩౫,౦౬,౬౭౦ (౨౦౦౧ లెక్కలు)

మండలములు ౩౭ ఇబ్రహీంపట్నం, యాచారం, మంచెల్, మహేశ్వరం, కందుకూరు, హయత్ నగర్, ఉప్పల్, సరూర్ నగర్, ఘటకేశ్వర్, మేడ్చల్, షామీర్ పేట, కుత్బుల్లాపూర్, కీసర, మల్కాజ్ గిరి, బాలానగర్, శేరిలింగంపల్లి, రాజేంద్రనగర్, శంషాబాద్, శంకరపల్లి, చేవెళ్ళ, మొయినాబాదు, షాబాదు, గండీడ్, కుల్కచర్ల, దోమ, పర్గి, పూడూరు, ధారూర్, నవాబ్ పేట, వికారాబాదు, మోమిన్ పేట, మర్పల్లి, బంట్వారం, పెద్దేముల, బషీరాబాద్, యాలాల్, తాండూరు.

ముఖ్య నది మూసీ (ముచుకుంద).
ముఖ్య పంటలు మొక్కజొన్న, వరి, పప్పుధాన్యములు, నూనెగింజలు, బంగాళాదుంపలు.
ముఖ్య పరిశ్రమలు నూలు, సిగరెట్లు, ఎరువులు, గాజు, సిమెంటి రేకులు, విద్యుత్ పరికరములు, యంత్ర పరికరములు, ఔషధములు.

## మెదక్

వైశాల్యము ౯,౬౯౯ చదరపు కిలోమీటర్లు.
జనాభా ౨౬,౬౨,౨౯౬ (౨౦౦౧ లెక్కలు)
మండలములు ౪౫ సంగారెడ్డి, కంగ్టి, కల్హేరు, నారాయణ్ ఖేడ్, మనూర్, రేగోడ్, శంకరంపేట, అల్లాదుర్గం, పులకల్, ఆందోల్, టేక్మల్, పాపన్నపేట, కొల్చారం (కోలాచలం), మెదక్, రామాయంపేట, ఎల్దుర్తి, చేగుంట, మిర్దొడ్డి, దుబ్బాక, సిద్ధిపేట, చిన్నకోడూరు, నంగునూరు, కొండపాక, జగదేవ్ పూర్, గజ్వేలు, దౌలతాబాదు, వర్గల్, ములుగు, తూప్రాన్, శివంపేట, జిన్నారం, నర్సాపూర్, కౌడిపల్లి, హత్నూరు, రామచంద్రాపురం, పటాన్ చెరువు, కొండాపురం, సదాశివపేట, మున్ పల్లి, కోహిర్, జహీరాబాద్, ఝురాసంగం, రాయ్ కోడ్, న్యాల్కల్, శంకరంపేట.
ముఖ్య నదులు మంజీరా, కుడిలియార్, హల్దీ (పసుపేరు).
ముఖ్య పంటలు వరి, జొన్న, మొక్కజొన్న, రాగులు, కుసుములు, బంగాళాదుంపలు.
ఖనిజములు పింగాణిమట్టి.
ముఖ్య పరిశ్రమలు తోళ్ళ పరిశ్రమ, ఉన్నినేత, పట్టుచీరలు, ఔషధములు.

## నిజామాబాదు

వైశాల్యము ౭,౯౫౬ చదరపు కిలోమీటర్లు.
జనాభా ౨౩,౪౨,౮౦౩ (౨౦౦౧ లెక్కలు)
మండలములు ౩౫ నిజామాబాదు, బాల్కొండ, ఆర్మూర్, జక్రాన్ పల్లి, మోర్తాడ్, కమ్మరపల్లి, వేల్పూర్, భీమ్ గల్, సిరికొండ, నందిపేట, నవీపేట, మాక్లూర్, డిచ్ పల్లి, ధర్పల్లి, రంజాల్, బోధన్, కోటగిరి, వర్ని మద్దనూరు, బిచ్కుంద, జుక్కల్, బిర్కూర్, బాన్సువాడ, నిజాంసాగర్, పిట్లం, గాంధారి, లింగంపేట, ఎల్లారెడ్డి, నాగిరెడ్డిపేట, సదాశివనగర్, తాడ్వాయి, కామారెడ్డి, మాచారెడ్డి, దోమకొండ, భిక్నూర్.
ముఖ్య నదులు మంజీరా (మాంజ్రా), గోదావరి, పులాంగు.
ముఖ్య పంటలు వరి, చెఱకు, పప్పుధాన్యములు, మొక్కజొన్న.
ముఖ్య పరిశ్రమలు చక్కెర, ఆల్కహాలు, ఉన్నినేత, బెల్లము.

## ఆదిలాబాదు

| | |
|---|---|
| వైశాల్యము | ౧౬,౧౨౮ చదరపు కిలోమీటర్లు. |
| జనాభా | ౨౪,౮౮,౩౪౭ (౨౦౦౧ లెక్కలు) |
| మండలములు ౫౨ | ఆదిలాబాదు, తలమడుగు, తాంశి, జైనాథ్, బేలా, బోథ్, బజార్ హత్నూర్, ఇచ్చోడ, నేరెడికొండ, గుడిహత్నూర్, ఉట్నూరు, ఇంద్రవెల్లి, సర్నూరు, జైనూరు, సిర్పూరు, లోహెస్త్రా, కుంతల, సారంగపూర్, నిర్మల్, దిల్వార్ పూర్, మమ్డా, లక్ష్మణ్ చాందా, కుభీర్, భైంసా, ముధోల్, తానూర్, ఖానాపూర్, కడెం (పెద్దూరు), జన్నారం, దండేపల్లి, లక్సెట్టిపల్లి, మంచిర్యాల, మందమర్రి, కాశింపేట, రెబ్బన, ఆసిఫాబాదు, తాండూరు, బెల్లంపల్లి, తిర్యాణి, కెరమేరి, చిన్నూరు, వాంకిడి, సిర్పూరు, కౌతల, బెజ్జూర్, దహేగాంనగర్, భీమిని, కాగజ్ పూర్, కోటపల్లి, వేమనపల్లి, జయపూర్, నెన్నాల్. |
| ముఖ్య నదులు | ప్రాణహిత, పెన్ గంగ, వార్ధా, కడెం, పెదవాగు, సిద్ధా, గోదావరి. |
| ముఖ్య పంటలు | వరి, జొన్న, సెనగలు, కందులు, పెసలు, ప్రత్తి, నువ్వులు, మొక్కజొన్న. |
| ఖనిజములు | బొగ్గు, ఇనుము, సున్నపురాయి, పింగాణిమట్టి. |
| ముఖ్య పరిశ్రమలు | నూనె, కాగితము, సిమెంటు. |

## కరీంనగర్

| | |
|---|---|
| వైశాల్యము | ౧౧,౮౨౩ చదరపు కిలోమీటర్లు. |
| జనాభా | ౩౪,౯౭,౦౯౮ (౨౦౦౧ లెక్కలు) |
| మండలములు ౫౬ | కరీంనగర్, మానకొండూరు, తిమ్మాపూర్, బెజ్జంకి, గంగాధర, రామడుగు, చొప్పదండి, హుస్నాబాదు, చిగురుమామిడి, కోహెడ, హుజూరాబాదు, జమ్మికుంట, వీణవంక, కమలాపూర్, ఎల్కదుర్తి, కేశవపట్నం, సైదాపూర్, భీమదేవరపల్లి, కొడిమ్యాల, జగిత్యాల, రాయికల్లు, ధర్మపురి, సారంగపురం, మల్యాల, కోరుట్ల, పెగడపల్లి, గొల్లపల్లి, మెట్ పల్లి, మేడిపల్లి, ఇబ్రహీంపట్నం, సిరిసిల్ల, మల్లాపూర్, కథులాపూర్, ఇల్లంతకుంట, గంభీర్రావుపేట, ముస్తాబాదు, ఎల్లారెడ్డిపేట, వేములవాడ, బోయనపల్లి, కోనరావుపేట, కోదండరావుపేట, చందుర్తి, పెద్దపల్లి, శ్రీరాంపురం, ఓడెల, రామగుండం, కమాన్ పూర్, సుల్తానాబాద్, వెల్గటూరు, ధర్మారం, జూలపల్లి, మంథని, ముత్తారం, తాడిచెర్ల, మహదేవపూర్, కాటారం. |
| ముఖ్య నదులు | గోదావరి, మున్నేరు. |
| ముఖ్య పంటలు | వరి, జొన్న, మొక్కజొన్న, పచ్చ పెసలు, మిరప, ఉలవలు, నువ్వులు, ఆముదాలు. |
| ఖనిజములు | ఇనుము, సున్నపురాయి, సబ్బురాయి. |
| ముఖ్య పరిశ్రమలు | తోళ్ళ పరిశ్రమ, ఉన్ని, విత్తనములు. |

## వరంగల్లు

వైశాల్యము ౧౨,౮౪౬ చదరపు కిలోమీటర్లు.

జనాభా ౩౨,౩౧,౧౭౪ (౨౦౦౧ లెక్కలు)

మండలములు ౫౦ హనుమకొండ, చిట్యాల, మొగుళ్ళపల్లి, భూపాలపల్లి, పరకాల, శాయంపేట, రేగొండ, ములుగు, ములుగు (ఘనపూర్), వెంకటాపూర్, తాడ్వాయ్, గోవిందరావుపేట, ఏటూరునాగారం, మంగంపేట, గూడూరు, ఖానాపూర్, కొత్తగూడెం, నర్సంపేట, నల్లబెల్లి, చెన్నారావుపేట, దుగ్గొండి, నెక్కొండ, హసన్ పర్తి, ఆత్మకూరుమ గీసుకొండ, జాఫర్ గడ్, సంగం, ఘనాపూర్, ధర్మసాగర్, చెరియల్, బచ్చన్నపేట, నర్మెట్ట, మద్దూరు, వర్ధన్నపేట, పర్వతగిరి, రాయపర్తి, జనగాం, రఘునాథపల్లి, లింగాల, ఘనపూర్, కొడకంట్ల, పాలకుర్తి, కొర్వి, దేవరుప్పల, మరిపెడ, నర్సింహులుపేట, తొర్రూరు, మహబూబాబాదు, డోర్నకల్లు, నెల్లి, కుదురు, కేసముద్రం.

ముఖ్య నదులు పాలేరు, గోదావరి, కిన్నెరసాని, వైరా, అలేరు, మున్నేరు.

ముఖ్య పంటలు వరి, సజ్జ, జొన్న, మొక్కజొన్న, పెసలు, వేరుశెనగ, ఆముదాలు.

ఖనిజములు ఇనుము, సున్నపురాయి, గ్రాఫైట్.

ముఖ్య పరిశ్రమలు నూలుబట్టలు, తివాచీలు, తోళ్ళ పరిశ్రమ.

## ఖమ్మం

వైశాల్యము ౧౬,౦౨౯ చదరపు కిలోమీటర్లు.

జనాభా ౨౫,౬౫,౪౧౨ (౨౦౦౧ లెక్కలు)

మండలములు ౪౬ ఖమ్మం (పట్టణ), ఖమ్మం (గ్రామీణ), ముదిగొండ, నేలకొండపల్లి, కొనిజెర్ల, చింతకాని, కూసుమంచి, తిరుమలాయపాలెం, ఎఱ్ఱిపాలెం, మధిర, బోనకల్లు, వైరా, కల్లూరు, పెనుబల్లి, వేంసూరు, సత్తుపల్లి, దమ్మపేట, అశ్వారావుపేట, ములకలపల్లి, ఇల్లందు, సింగరేణి, కామేపల్లి, గార్లబయ్యారం, గుండాల, టేకులపల్లి, కొత్తగూడెం, పాల్వంచ, జూలూరుపాడు, చంద్రుగొండ, తల్లాడ, వాజీడు, ఎన్కూరు, బూర్గంపాడు, కుకునూరు, వేలేర్ పాడు, మంగూరు, అశ్వపురం, పినపాక, దుమ్ముగూడెం, భద్రాచలం, కూనవరం, వరరామచంద్రాపురం, చింతూరు, వెంకటాపురం, చర్ల.

ముఖ్య నదులు మున్నేరు, పాలేరు, కిన్నెరసాని, వైరా, శబరి, సీలేరు, గోదావరి.

ముఖ్య పంటలు జొన్న, వరి, పెసలు, ఉలవలు, వేరుశెనగ, నువ్వులు, మిరప, పొగాకు, మొక్కజొన్న.

ఖనిజములు నేలబొగ్గు, ఇనుము, గ్రాఫైట్, సున్నపురాయి, ముగ్గురాయి,

ముఖ్య పరిశ్రమలు ఎరువులు, బొగ్గు.

## ఆంధ్ర ప్రదేశ్ లోని ముఖ్యనదులు

మన రాష్ట్రములో చిన్నా, పెద్దా కలిపి మొత్తం 30కి పైగా నదులున్నాయి. అందుకే మన రాష్ట్రాన్ని నదులు రాష్ట్రమని పిలుస్తారు. ఇవిగాక కుంటలు, చెరువులు కూడా అనేకం రాష్ట్రములో ఉన్నాయి. ఈ విధముగా నదీపరీవాహక ప్రాంతములను ఆధారముగా కలిగియున్నందువలన మన రాష్ట్రము సఅరవంతమైన పంటభూములతో సస్యశ్యామముగా విరాజిల్లుతోంది. నీటివనరులు అధికముగా ఉండుటవలన వ్యవసాయ ప్రధాన రాష్ట్రముగా రూపొంది, భారతదేశ ధాన్యాగారముగా, అన్నపూర్ణగా మనరాష్ట్రం వినతికెక్కినది. మనరాష్ట్ర వ్యవసాయ రంగమునకు ఆయువుపట్టు అయిన ముఖ్య నదులుగురించి తెలుసుకుందాము.

### గోదావరి నది

మన రాష్ట్రములోని నదులన్నింటిలోకి అతిపెద్ద, ముఖ్యమైన నది గోదావరి. అంతేకాదు, భారతదేశ నదుల్లోనే గంగానది తరువాత విశిష్ట స్థానాన్ని పొందినది ఈ నది, అందుకే దీనిని దక్షిణ గంగ అని వ్యవహరిస్తారు. మహారాష్ట్రలోని నాసిక్ మండలములోని త్ర్యంబకం వద్ద సహ్యాద్రి పర్వతసానువు (పడమటి కనుమలు)లలో జన్మించిన ఈ జీవనది ఆదిలాబాద్ జిల్లాలోని బాసర (వ్యాసపురి) సమీపములో మన రాష్ట్రములోనికి ప్రవేశిస్తోంది. సుమారు తొమ్మిది వందల కోసుల పొడవును కలిగియున్న పవిత్రనది మన రాష్ట్రములోని ఆదిలాబాద్, నిజామాబాద్, కరీంనగర్, వరంగల్, ఖమ్మం, తూర్పు మఱియు పశ్చిమ గోదావరి జిల్లాగుండా ప్రవహించి చివరగా బంగాళాఖాతములో కలుస్తోంది.

ఈ సుదీర్ఘ యాత్రలో ఈ నదికి అనేక ఉపనదులు తోడయ్యాయి, వాటిలో మంజీరా నది ప్రధానమైనది. ప్రాణహిత, మానేరు, ఇంద్రావతి, శబరి, కిన్నెరసాని మొదలైన ఉపనదులు దీనిలీ కలియుచున్నవి. గోదావరి నదిలో మొట్టమొదట కలుస్తున్న నది మంజీరా. కర్ణాటక రాష్ట్రములోని బీదర్ జిల్లాలో జన్మించి ఈ ది మెదక్, నిజామాబాద్, జిల్లాల్లో రమారమి ౬౦ కోసులు ప్రవహించి నిజామాబాద్ జిల్లాలోని కుందుర్తి వద్ద గోదావరిలో కలియుచున్నది. ఈ మంజీర నదిపై నిజాంసాగర్ వద్ద ఆనకట్టలు నిర్మించబడ్డాయి. గోదావరికి ఎడమవైపునుండి ప్రవహిస్తూ ప్రాణహిత నది ఆదిలాబాద్ జిల్లాలోని కాళేశ్వరం వద్ద గోదావరిలో సలుస్తోంది. పెన్ గంగ, పెద్ద గంగ, వరద, వైన్ గంగ, వినయగంగ అనే మూడు నదులు కలిసి ఈ ప్రాణహిత నది ఏర్పడినది. గోదావరికి మరో ఉపనది అయిన ఇంద్రావతి, బస్తర్ సంస్థానానికి దక్షిణమున ఎడమవైపున గోదావరిలో కలుస్తోంది. ఖమ్మం జిల్లాలోని కూనవరంవద్ద మరో ఉపనది శబరి గోదావరిలో సంగమిస్తోంది. ఈ విధముగా ఉపనదులతో పరిపుష్టి చెందిన గోదావరి భద్రాచలరాముని పాదములంటి, పాపికొండల గుండా ప్రవహించి, రాజమహేంద్రవరం (రాజమండ్రి) వద్ద గౌతమి, వసిష్ఠ అను రెండు పాయలుగా చీలినది. గౌతమి యానాం వద్ద, వసిష్ఠ నరసాపురం సమీపములోని అంతర్వేది వద్ద బంగాళాఖాతములో కలుస్తున్నాయి. రాజమండ్రినుండి సముద్రాన్ని చేరేలోపల ఈ నది తుల్యభాగ, ఆత్రేయ, గౌతమి, వృద్ధగౌతమి, భరద్వాజ, కౌశిక, వశిష్ఠ అనే ఏడు పాయలుగా చీలి సప్తగోదావరిగా ప్రసిద్ధి పొందినది. ఈ సప్తగోదావరీపరివృత్తమైన డెల్టాభూభాగమే కోనసీమగా ఖ్యాతిగాంచినది. రాజమండ్రి సమీపములోని ధవళేశ్వరం వద్ద క్రీ.శ. ౧౮౫౨ సం. లో సర్ ఆర్థర్ కాటన్ దొర ఈ నదిపై ఆనకట్ట నిర్మించడంతో ఈ ప్రాంతము సస్యశ్యామలముగా మారినది. వరద ప్రమాదాలు కూడా నివారించబడ్డాయి. గోదావరిలోయ పొడవునా దట్టమైన మన్యం అడవులు ఉన్నాయి. పాపికొండల ప్రాంతములోని మనోహర దృశ్యాల వలన గోదావరినదిని భారతదేశ నైల్ నది అన విదేశీయులు ప్రస్తుతించారు. సింహరాశిలో బృహస్పతి ప్రవేశించి ఉండే ఏడాదికాలం ఈ నదికి పుష్కర కాలం.

## కృష్ణానది

మన రాష్ట్రములో గోదావరి తరువాత ప్రధానమైనది కృష్ణానది. ఈ నది పడమటి కనుమలలో మహారాష్ట్రములోని మహాబలేశ్వర్ వద్ద జన్మించి మహబూబునగర్ జిల్లా మక్తల్ తాలూకాలోని సిద్ధేశ్వరం వద్ద మన రాష్ట్రములో ప్రవేశిస్తోంది. దాదాపు ౭౨౦ కోసుల నిడివి కలిగిన ఈ నదికి మహారాష్ట్రములోని పెణ్ణానది కలియడముచేత ఇది కృష్ణవేణిగా పిలవబడుతోంది. ఈ నది మహబూబునగర్, కర్నూలు, నల్గొండ, కృష్ణా, గుంటూరు జిల్లాలగుండా ప్రవహించి కృష్ణాజిల్లాలోని హంసలదీవి వద్ద సముద్రములో కలుస్తోంది. ఇది కతష్ణాజిల్లా పులిగడ్డ వద్ద రెండుగా చీలడంతో దివిసీమ ఏర్పడినది.

తుంగభద్ర, మూసీ, దిండి, భవనాశి, పాలేరు, మున్నేరు, ఘటప్రభ, మలప్రభ, నాగులేరు, చంద్రవంకలు దీనికి ఉపనదులు. భీమనది రాయచూరువద్ద, తుంగభద్ర సంగమేశ్వరమువద్ద, మూసీనది నల్గొండ జిల్లాలోని వాడపల్లివద్ద కృష్ణానదిలో సంగమించుచున్నవి. ఈ నదిపై ఆనకట్టలు, రహదారి వంతెనలు అనేకము ఉన్నాయి. నందికొండప సమీపములో నాగార్జునసాగర్ అనే అతిపెద్ద ఆనకట్ట ఈ నదిపై నిర్మించబడినది. కృష్ణ ఉపనదులలో అతిపెద్ద ఉపనది భీమనది. బృహస్పతి కన్యారాశిలో ప్రవేశించినప్పుడు కృష్ణానదికి పుష్కరము వస్తోంది.

## పెన్నానది

పెన్నానది కర్ణటక రాష్ట్రములోని కోలారు వద్దగల నందిదుర్గం కొండల సమీపములోని చెన్నకేశవగిరి వద్ద జన్మించినది. ఈ నదికి పినాకిని అను నామాంతరము గలదు. ఈ నది మన రాష్ట్రములోని అనంతపురం, కడప, కర్నూలు, నెల్లూరు జిల్లాల గుండా ప్రవహించి నెల్లూరు జిల్లాలోని ఊటుకూరు వద్ద సముద్రములో కలుస్తోంది. దీని పొడవు సుమారు ౫౭౦ కి.మీ. జయమంగళ, కుందేరు, పాపఘ్ని, చిత్రావతిలు దీని ఉపనదులు. ఈ నది ప్రవహించే ప్రాంతమంతా కొండలు గుట్టలతో నిండి, వాగులు అధికముగా ఉన్నందున ఈ నదికి హఠాత్తుగా వరదలు వచ్చుచుండును. అందువల్లనే "పెన్న దాటితే పెరుమాళ్ళ సేవ చేసినంత ఫలం" అనే లోకోక్తి ఏర్పడినది.

## తుంగభద్రానది

తుంగ, భద్ర అనే రెండు నదుల కలయిక వలన తుంగభద్రానది ఏర్పడినది. మైసూరు ప్రాంతములోని నైర్మతి కొండలలో జన్మించిన ఈ రెండు నదులు కర్ణాటక రాష్ట్రములోని షిమోగా (శివమొగ్గ) వద్ద సంగమించి, కర్నూలు జిల్లాలో ఆంధ్రదేశములో ప్రవేశించి కూడలి సంగమం వద్ద కృష్ణానదిలో కలుస్తోంది. సుమారు ౪౦౦ కోసుల పొడవును కలిగియున్న ఈ నది కర్నూలు పట్టణ సమీపములో హంద్రీ నదిలో కలుస్తోంది. బృహస్పతి మకరరాశిలో ప్రవేశించిన సమయములో ఈ నదికి (భద్రానదికి) పుష్కరకాలము.

## వంశధారానది

తూర్పు కనుమలలోని మహేంద్ర పర్వతములలో పుట్టి బంగాళాఖాతములో సంగమించే నదుల్లోవంశధార, నాగావళి ప్రధానమైనవి. ఇందలి వంశధార ఒరిస్సా లోని కటక్ తాలూకా బిస్సంలోని దిమ్మగిరి కొండలలో జన్మించి శ్రీకాకుళం జిల్లాలో ప్రవహించి

కళింగపట్నం సమీపములో బంగాళాఖాతములో కలుస్తోంది. ౨౨౪ కి.మీ. పొడవుగల ఈ నది తూర్పుకనుమల్లో పుట్టి బంగాళాఖాతములో కలిసే నదులన్నింటిలో పెద్దది.

## నాగావళీనది

పురాణ ప్రసిద్ధ నదులలో నాగావళి ఒకటి. పురాణాలలో ఈ నది లాంగుల్య, లాంగళి అనే పేర్లతో ప్రస్తావించబడినది. ఒరిస్సాలోని రాయగఢ్, కాలహండి సంస్థాన సమీపమున మహేంద్ర పర్వతములలో జన్మించిన ఈ నది మన రాష్ట్రములోని విజయనగరం జిల్లా పార్వతీపురమునకు తూర్పున పన్నెండు కోసుల దూరములో శ్రీకాకుళంవద్ద సముద్రములో కలుస్తోంది. జంఝావతి, వేగవతి, సువర్ణముఖి అనేవి ఈ నదికి ఉపనదులు. దీని పొడవు సుమారు ౧౪౦ కోసులు.

ఇవియేగాక విశాఖపట్టణము, విజయనగరము, జిల్లాలలోని గోస్తని, శారద, వరాహ, తాండవ, బహుదా నదులు, తూరజపు గోదావరి జిల్లాలోని ఏలేరు, పంపా నదులు, పశ్చిమగోదావరి జిల్లాలోని తమ్మిలేరు, గుంటూరు జిల్లాలోని తుంగభద్ర, గుండ్లకమ్మ, నాగులేరు, చంద్రవంక నదులు, నెల్లూరు జిల్లాలోని కండ్లేరు, ముచుకుంద, పాలేరు, మున్నేరు, స్వర్ణముఖి మొదలైనవికూడ పేర్కొనదగ్గ నదులే. మనరాష్ట్రములోని విశాఖ, శ్రీకాకుళం జిల్లాల్లోనే సుమారు ౧౭ నదులున్నాయి

## ఆంధ్రరాష్ట్రములోని అడవులు

ఆంధ్రప్రదేశములోని అడవులను నాలుగు విధములుగా వర్గీకరించవచ్చును. అవి

౧. చెమ్మనేళలోని ఆకురాల్చు అడవులు

౨. ఆకురాల్చు అడవులు

౩. చిట్టడవులు మరియు

౪. తీరప్రాంత అడవులు

౧. చెమ్మనేళలోని ఆకురాల్చు అడవులు:సాధారణ వర్షపాతం హెచ్చుగా ఉండే ప్రాంతములలో ఈ తరహా అడవులు అభివృద్ధి చెందుతాయి. మన రాష్ట్రములో శ్రీకాకుళం, విశాఖపట్టణము, తూర్పు మరియు పశ్చిమ గోదావరి, వరంగల్, ఆదిలాబాద్ జిల్లాలలో ఈ అడవులు ఉన్నాయి. వృక్షశాస్త్ర సంబంధమైన చెట్లతోపాటు టేకు, నల్లమద్ది మొదలైన కలప ఈ అడవుల్లో దొరుకుతుంది.

౨. ఆకురాల్చు అడవులు:సహజముగా వర్షపాతము ఎక్కువగా ఉండే ప్రాంతాలలో ఈ అడవులుఉంటాయి. మనరాష్ట్రములో నిజామబాద్, మెదక్, కరీంనగర్, వరంగల్, చిత్తూరు మరియు కడప జిల్లాలలో ఈ అడవులు ఉన్నాయి. ఈ అడవుల్లో టేకు, ఏగి, బండారు, ఏపి, చిరుమాను, నల్లమద్ది, వెదురు మొదలగునవి లభించును.

౩. చిట్టడవులు:కొండ దిగువ భాగమున గల అడవులు ఈ కోవకు చెందుతాయి. ఈ అడవుల్లో ముళ్ళపొదలు అధికముగా కన్పిస్తాయి. రాయలసీమ ప్రాంతములో ఈ అడవులు విస్తారముగా ఉన్నాయి. గుంటూరు, హైదరాబాద్, మహబూబునగర్, ఖమ్మం మరియు నల్గొండ జిల్లాలలో కూడ ఉన్నాయి. రెల్లుగడ్డి అధికముగా పెరిగే ఈ అడవులు సంచారానికి బాగా ఉపయోగపడతాయి.

౪. తీరప్రాంత అడవులు:ఈ అడవులు కోస్తా తీరపు ఇసుక నేలల్లో వ్యాపించి ఉన్నాయి. కృష్ణా, గుంటూరు, నెల్లూరు మరియు ప్రకాశం జిల్లాలలో ఈ అడవులు అధికముగా ఉన్నాయి. ౧౯౯౭ లెక్కల ప్రకారము మన రాష్ట్ర విస్తీర్ణములో ౧౫.౭౪ శాతము మాత్రమే నిజమైన అటవీ ప్రాంతము గలదు. మొత్తము విస్తీర్ణములో మూడవ వంతు అడవులుండాలని శాస్త్రజ్ఞుల అభిప్రాయము. తక్కువగా ఉన్నా అటవీ శాతము రాను రాను ఇంకా తరుగుతూండడము ఆందోళన కలిగించే విషయము. దీనివల్ల క్షామపీడిత ప్రాంతములు ప్రతి సంవత్సరము పెరుగుతున్నఅయి. కాబట్టి మనరాష్ట్రములో అడవులను పెంచవలసిన ఆవశ్యకత ఎంతయినా ఉన్నది.

## ఆంధ్రప్రదేశములోని వ్యవసాయము

మన రాష్ట్రము వ్యవసాయప్రధానమైన రాష్ట్రము. రాష్ట్రవైశాల్యము లోని సుమారు సగభాగము వివిధ పంటల క్రింద సేద్యం చేయబడుతున్నది. అందులోను ఆహార పంటలను రైతులు ఎక్కువగా పండిస్తున్నారు. రాష్ట్రములో పండింపబడు ఆహారధాన్యములలో వరిపంటది అగ్రస్థానము. ౩౯.౦ లక్షల హెక్టారుల (౧౯౯౯ - ౨౦౦౦ లెక్కలు) భూమిలో వరిని పండిస్తున్నారు. వరి తర్వాత ప్రధాన ఆహారపంట జొన్న. దీనిని ౭.౭ లక్షల హెక్టారుల ((౧౯౯౯ - ౨౦౦౦ లెక్కలు) భూమిలో పండిస్తున్నారు. రాష్ట్రములోని తెలంగాణా, రాయలసీమ ప్రాంతములో జొన్న పంట అధికముగా పండించుచున్నారు.

ఇవిగాక సజ్జ, రాగి, మొక్కజొన్న, గోధుమ, కొఱ్ఱ, పప్పు ధాన్యములు కూడా విస్తారముగా పండించుచున్నారు. వీటిలో వాణిజ్యపంటలైన వేరుశెనగ, ఆముదాలు, ధనియాలు, ప్రత్తి, చెరకు, మిరప, పొగాకు, పసుపు మొదలైన వాటిని పండిస్తారు, ఇవేగాక మామిడి, నిమ్మ, నారింజ, బత్తాయి, కమలాలు మొదలైన ఫలములు కూడ మనరాష్ట్రములో అధికముగా పండించుచున్నారు.

## ఆంధ్రప్రదేశములోని సుప్రసిద్ధ క్షేత్రములు

### అన్నవరము

తూర్పు గోదావరి జిల్లాలోని అన్నవరము వద్ద శ్రీ వీరవేంకట సత్యనారాయణస్వామి వారి దేవాలయము చిన్న కొండలపైన గలదు.

### అమరావతి

ఇది గుంటూరు పట్టణమునకు సుమారు ౨౦ కోసుల దూరములో కృష్ణానదీ తీరముననున్నది. ఇది పూర్వము ఆంధ్రరాజ్యము వెలసియుండిన కాలములో గొప్ప పట్టణముగా నుండెను. ఇక్కడ శ్రీ అమరలింగేశ్వరస్వామి ఆలయమున్నది. ఆ శివలింగము ప్రతి హిందువూ దర్శించి తరించవలెను. పూర్వము బౌద్ధుల విహారముగా కూడా నుండినది. ప్రసిద్ధ పంచారామములలో ఇది ఒక ఆరామము. బౌద్ధలైన ఆంధ్రుల శిల్పకళా ప్రావీణ్యమును జూపు కట్టడములు, శిల్పములు పెక్కు నిచ్చట నున్నవి.

### అరసవిల్లి

శ్రీకాకుళము జిల్లాలో గల ఈ ప్రదేశములో సుప్రసిద్ధమైన శ్రీ సూర్యనారాయణమూర్తి దేవాలయము గలదు. ప్రతిదినము సూర్యోదయవేళకు సూర్య కిరణములు సరాసరి ఈ దేవాలయములోని మూలవిరాట్టు మ్రోల పడుచుండుట ఇందలి ముఖ్య విశేషము.

### హనుమకొండ

ఇక్కడి ౧౧౬౨ - ౧౧౬౩లో కట్టిన వేయి స్తంభముల దేవాలయము కలదు. ఇక్కడ శివ, విష్ణు, సూర్యులకు వేరు వేరుగా ఒక్కొక్క గుడి కలదు. శివాలయమునకెదుటనున్న నంది విగ్రహము ఏకశిలావిగ్రహము. దీనికి దగ్గర రామప్పదేవాలయము కలదు. గుడిలోని శిల్పకళ అబ్బురముగా ఉండును.

### ఆలంపురము

మహబూబునగర్ జిల్లాలో తుంగభద్రానదీ తీరమందున్న ప్రసిద్ధ క్షేత్రము. దీనిని దక్షిణకాశి అనికూడ అందురు. ఇక్కడి దేవాలయముల అందము, శిల్పముల సౌందర్యము చూచి తీరవలసినదే.

### ఒంటిమిట్ట

కడప జిల్లా సిద్ధవటం తాలూకాలోని ప్రసిద్ధక్షేత్రము. ఇక్కడ కొండమీద వేంచేసియున్న కోదండరామస్వామి ఆలయము మిక్కి ప్రసిద్ధమైనది. ఆంధ్ర భాగవతము రచించిన బమ్మెర పోతన మహాకవి శిష్యులు ఆరాధించిన స్వామి ఈ కోదండరాముడు. ఏటేటా ఇక్కడ వైభవముగా ఉత్సవములు జరుగును. ఇక్కడ శ్రీసీతారామలక్ష్మణ శిలా విగ్రహములు ఒకే శిలలోనున్నవి.

### శ్రీకాళహస్తి

ఇది చిత్తూరు జిల్లాలో సువర్ణముఖీ నదీతీమందున్న సుప్రసిద్ధ శివక్షేత్రము. ఇక్కడి లింగము వాయులింగము. ఇక్కడి ఆలయము బ్రహ్మాండమైనది. ఒక సాలెపురుగు (శ్రీ), ఒక సర్పము (కాళము), ఒక ఏనుగు (హస్తి) మహాభక్తితో పరమేశ్వరుని సేవించి ముక్తి పొందినందున ఈ క్షేత్రమునకు శ్రీకాళహస్తి యను పేరువచ్చినది. దీనిని కన్నప్ప కొండ అని అందురు. బోయ కన్నప్ప తన కంటిని ఊడబెరికి పరమేశ్వరునికి ఇచ్చి తన అవ్యాజమైన భక్తిని ప్రదర్శించినది ఈ మహాక్షేత్రమునందే.

### కీరపండరి

ఇది కృష్ణా జిల్లాలోని మచిలీపట్టణమునకు సమీపముననున్నది. దీని అసలు పేరు చిలకలపూడి. ఇటీవల పండరీనాథుని క్షేత్రముగా వెలసి, కీరపండరి అయినది. ఇక్కడి విగ్రహము పండరీపురములోని దానివలె చాల ముచ్చటగా నుండును. ప్రతి సంవత్సరము ఇక్కడ బ్రహ్మోత్సవము వైభవముగా జరుగును.

### కోటప్పకొండ

గుంటూరు జిల్లాలో నరసరావుపేటకు సమీపములోనున్నది. ఇందలి ఆలయము కోటీశ్వరాలయము. శివరాత్రికి ఏటేటా గొప్ప యుత్సవములు జరుగును. కొండమీదనుండే ఈ ఆలయమునకు లక్షలాది ప్రజలు వత్తురు. పలువురు బండ్లమీద ప్రభలు కట్టుకొని వచ్చి మ్రొక్కుబళ్ళు చెల్లింతురు.

### తిరుచానూరు

ఇది తిరుపతికి దగ్గరగా నున్నది. దీనినే అలమేలు మంగాపురము అని కూడా వ్యవహరింతురు. అలమేలు మంగమ్మ వేఙ్కటేశ్వరస్వామి భార్య. ఆమెకే పద్మావతిదేవి అని మరొక పేరు కలదు. ఇచ్చట ప్రసిద్ధిగావించిన ఆమె దేవాలయము కలదు.

## తిరుమల (తిరుపతి)

ఇది యావద్భారతమున గొప్ప క్షేత్రము. ఇక్కడి ఏడుకొండల దేముడు ప్రత్యక్షదైవము. భక్తులు అనుకున్నంతనే ఆదరించి ఆదుకొనువాడు. ఆయనను శ్రీవేఙ్కటేశ్వరస్వామి అని, శ్రీనివాసుడు అని, బాలాజీ అని పలువురు పలు పేర్లతో పిలుతురు. ప్రతిరోజు వేలాది యాత్రికులతో ఈ క్షేత్రము కిటకిటలాడుచుండును.

## ద్రాక్షారామము

ఇది భీమేశ్వరస్వామి దివ్యక్షేత్రము. ఇక్కడి దేవాలయము కడుదొడ్డది. పంచారామములు అని ప్రసిద్ధిపొందిన ఆరామములలో ఈ ద్రాక్షారామము అతి ముఖ్యమైనది.

## పుష్పగిరి

ఇది కడప జిల్లాలో పినాకినీ నదీతీర మందున్నది. ఆదిశంకరుల పీఠము ఇందున్నది. దానిని పుష్పగిరి పీఠము అందురు. ఇక్కడ చెన్నకేశ్వరస్వామికి ప్రతి వైశాఖ శుద్ధములో గొప్ప యుత్సవము జరుగును. ఈ దేవాలయములో చక్కని శిల్పములున్నవి.

## భద్రాచలము

తెలుగువారి ఇష్టదైవమైన శ్రీరామచంద్రుని దివ్యక్షేత్రము. ఇక్కడి దేవస్థానము మిక్కిలి ప్రాచీనమైనది. భక్తరామదాసు తన తనువును, ధనమును, సమస్తమును అర్పించి రాజదండనమునుకూడ లెక్కచేయక మనసార కొలిచినది ఇక్కడి శ్రీరామచంద్రమూర్తినే. ప్రతి సంవత్సరము చైత్రశుద్ధ నవమికి ఇక్కడ స్వామికి కల్యాణోత్సవము మహావైభవముగా జరుగును. ఈ క్షేత్రము గోదావరి నదీ తీరములో ఒక కొండపై నున్నది.

## యాదగిరి

నల్లగొండ జిల్లాలోని భువనగిరి తాలూకాలో గల ఈ క్షేత్రమున ఋష్యశృంగుని కుమారుడైన యాదర్షి తపస్సు చేసెను. ఆయన ప్రార్థనలతో జీవకోటి తరించుటకై శ్రీలక్ష్మీ నరసింహస్వామి ఈ యాగిరిలో స్వయంవ్యక్తముగా వెలసినారు. నృసింహక్షేత్రములలో మిక్కిలి పేరుపొందిన క్షేత్రముల అనేకమహిమలుగల పిలిచిన పలికే ప్రత్యక్ష దైవమీ శ్రీలక్ష్మీనృసింహస్వామివారు.

## లేపాక్షి

ఇది అనంతపురము జిల్లాలో హిందూపురమునకు సమీపమున కలదు. ఇక్కడ విరుపణ్ణ, వీరణ్ణ నాయకులు కట్టించిన వీరభద్రస్వామి ఆలయము సుప్రసిద్ధమైనది. ఇదికాక పాపనాశేశ్వరాలయము, రఘునాథాలయములు కూడా నున్నవి. వీరభద్రస్వామి విగ్రహము ఏకశిలతో చెక్కబడిన బ్రహ్మాండమైన విగ్రహము. ఇక్కడి బ్రహ్మాండమైన నంది విగ్రహము కూడ అంతే. ఆ దేవాలయములో గోడలమీదను, లోకప్పులమీదను ఇప్పటికిని రంగు చెదరని రంగు రంగుల ప్రాచీన చిత్రములు అనేకములున్నవి. రామాయణ గాథలను వివరించు శిల్పములు కూడ చాలా నున్నవి. లేపాక్షి రామాయణము సుప్రసిద్ధ యక్షగానము ఇక్కడి కవులు రచించినదే.

### మహానంది

శ్రీశైల పర్వత ప్రాంతములోని దట్టమైన అడవుల మధ్య దివ్యమైన ప్రకృతి దృశ్యములతో మహానంది క్షేత్రము చూడచక్కగ నుండును. ఇందులోని అధిష్ఠానదేవత మహానందీశ్వరుడు. ఇక్కడ పెద్ద నందినోటినుండి జలధార జలజల జారుచుండును. దాని ముందే ఒక చిన్న కోనేరున్నది. అందులో నీరు స్వచ్ఛము, ఆరోగ్యప్రదము, స్నానము చేయుటకు ఆనందముగానుండును.

### విజయవాడ

పూర్వమున ఈ నగరమునకు విజయవాటిక, బెజవాడ అను పేర్లు కూడ కలవు. ఈ నగరము కృష్ణానదీతీరమున నున్నది. ఇచ్చట కొండమీద వేంచేసియున్న శ్రీకనకదుర్గాఅమ్మవారి దేవాలయము సుప్రసిద్ధ క్షేత్రము.

### శ్రీశైలము

బహుప్రఖ్యాతి చెందిన శ్రీమల్లికార్జునస్వామి దేవాలయము సుందరమైన అడవిలో నున్నది. భారతదేశములోని ద్వాదశజ్యోతిర్లింగములలో ఒక ప్రధాన లింగము ఇందులో వెలసియున్నది. భ్రమరాంబా సహిత శ్రీమల్లికార్జునస్వామికి ప్రతిసంవత్సరమూ శివరాత్రి రోజున వైభవముగా ఉత్సవము జరుగును. భ్రమరాంబాదేవి అష్టాదశ శక్తి పీఠాధి దేవతలలో నొక దేవత.

### సంగమేశ్వరము

కర్నూలు జిల్లా నందికొట్కూరు తాలూకాలో కృష్ణా, తుంగభద్ర, భవనాశి నదులు కలియుచోట నున్న పుణ్యక్షేత్రము.

### శ్రీకూర్మము

ఇది శ్రీకాకుళము జిల్లాలో గల కూర్మనాథ క్షేత్రము. కూర్మావతారమెత్తిన మహావిష్ణు దేవాలయము ఇక్కడ తప్ప యావద్భారతదేశములోను మరియొకచోట లేదు.

### సింహాచలము

విశాఖపట్టణమునకు సమీపమున కొండపైన వెలసిన నరసింహస్వామి దేవాలయమిచ్చట కలదు. అందుకే దీనిని సింహాచలమని అందురు.

### వేదాద్రి

ఇది కృష్ణాజిల్లాలోని జగ్గయ్యపేట దగ్గర నున్నది. ఇది నరసింహస్వామి క్షేత్రము. ఆయన కొండపై వేంచేసియున్నాడు.

## ఆంధ్రభాష

మానవులు పరస్పరము తమ అభిప్రాయములను తెలుపుటకు సాధనము భాష. భాషింపబడుచున్నది గాన దీనికి భాషయని పేరు కలిగెను. భావగ్రహణము, భావప్రకటనము భాష ప్రధాన ప్రయోజనము. ప్రపంచమున అనేక భాషలున్నవి. మన దేశములో పెక్కు భాషలున్నను ౧౮ భాషలను ముఖ్యభాషలుగా భారత ప్రభుత్వము గుర్తించినది. అట్టి భాషలలో సుమారు ఏడున్నర కోట్లకు పైగా జనులు తెలుగుభాషను మాట్లాడుచున్నారు. మనభాష ఆంధ్రము, తెలుగు, తెనుఁగు అను పేర్లతో వ్యవహరింపబడుచున్నవి.

నేడు లభించిన తెలుగు గ్రంథములలో ఆంధ్ర మహాభారతమే మొదటిదిగా పరిగణింపబడుచున్నది. తెలుగు భారతము చాల రసవంతమైన గ్రంథము. ఈ భారతమును పద్యగద్యములో రచియింప మొదలు పెట్టినవాడు నన్నయభట్టు. అతని కాలము ౧౧ వ శతాబ్దము. అతడు వ్రాయక వదలిన భాగములను తర్వాత తిక్కన సోమయాజి, ఎఱ్ఱాప్రగ్గడలు పూర్తి చేసిరి.

భారతమువలె భాస్కర రామాయణము, రంగనాథ రామాయణము, పోతన భాగవతము మున్నగు గ్రంథరాజములు ఆంధ్రుల కెల్లరకు అభిమాన పాత్రములయి బహుళ ప్రచారములోనున్నవి. ఇవికాక శ్రీకృష్ణదేవరాయలు అష్టదిగ్గజాదికవులు ఆంధ్రభాషలో రచించిన మహత్ప్రబంధములు, ఆంధ్రభాషలో మిక్కిలి పేరు పొందినవి. ఇవికాక ద్విపద కావ్యములు, నాటకములు, నవలలు, కథానికలు, విమర్శనలు, వ్యాసములు, గేయములు మున్నగు వివిధ రచనలు తెలుగున వెలయుచున్నవి. తెలుగులో మహాకవులు, మహారచయితలు వెలసిరి, వెలయుచున్నారు.

# ఆంధ్రభాషలో ప్రఖ్యాతిగన్న మహాకవులు

## నన్నయభట్టు

క్రీ.శ. ౧౧వ శతాబ్దికి చెందిన వాడు. ఆంధ్రమహాభారతమున ఆది, సభా, మరియు అరణ్యపర్వమున సగభాగము రచించెను. భారతమునకు పూర్వము ఆంధ్రభాషలో వ్రాయబడిన గ్రంథములేవియు లభింపనందున ఇతడే ఆదికవియని ప్రసిద్ధి గాంచెను. రాజమహేంద్రవరమును బాలించిన రాజరాజనరేంద్రుని యాస్థానకవి. ఆంధ్రశబ్ద చింతామణియను తెలుగు వ్యాకరణమును గూడ రచించెనందురు. ఆదికవి, శబ్దశాశనుడనునవి యితని బిరుదములు.

## నన్నచోడుడు

క్రీ.శ. ౧౨వ శతాబ్దికి చెందినవాడు. తెలుగులో మొట్టమొదటి మహాకవి, రచయిత, శివ కవులలో మొదటివాడు. కుమారసంభవము అను పద్యకృతి ఈయన కృతము. జానుతెనుగులో కవిత్వము వ్రాసిన మొదటి కవి. ఇతడు తన కవిత్వము వస్తు కవితయని పేర్కొన్నాడు. ఈయన కాలమునకు సంబంధించి పరిశోధకులలో భిన్నాభిప్రాయములు గలవు.

## తిక్కన సోమయాజి

క్రీ.శ. ౧౩వ శతాబ్దికి చెందినవాడు. నన్నయ తరువాత భారతమున విరాటపర్వము నుండి స్వర్గారోహణ పర్వము వరకు ౧౫ పర్వములు వ్రాసెను. ఇతని యితర కృతి నిర్వచనోత్తర రామాయణము. కవిబ్రహ్మ, ఉభయకవి మిత్రుడనునవి ఈతని బిరుదములు. ఇతడు నెల్లూరును బాలించిన మనుమసిద్ధి మహారాజు గారికి మహామంత్రి, ఆస్థానకవి. సోమయజ్ఞము చేసి సోమయాజి యయ్యెను.

## ఎఱ్ఱాప్రగడ

క్రీ.శ. ౧౪వ శతాబ్దికి చెందినవాడు. భారతమును నన్నయ అసంపూర్తిగా వదిలిన అరణ్య పర్వశేషమును పూర్తి చేసెను. నృసింహ పురాణము, హరివంశములను రచించెను. శంభుదాసుడు, ప్రబంధ పరమేశ్వరుడనునవి నీతని బిరుదములు. అద్దంకిసీమను పాలించిన ప్రోలయ వేమారెడ్డి యొక్క అస్థానకవి, విద్వాంసుడు. వేదవ్యాస విరచితమైన సంస్కృతత భఅరతమును వ్రాసిన నన్నయ, తిక్కన, ఎఱ్ఱనలకు కవిత్రయమని పేరు.

## పాల్కురికి సోమకవి

క్రీ.శ. ౧౨ - ౧౩ వ శతాబ్దులకు చెందినవాడు. వీరశైవమతమును ప్రచారము చేసిన కవి. ఆంధ్ర, కర్ణాటక దేశములలో ప్రసిద్ధి గాంచినవాడు. దేశయఛందస్సు యైన ద్విపదకు ప్రాధాన్యమిచ్చినవాడు. ద్విపద కవితావాఙ్మయమునకు మొదట శ్రీకారము చుట్టినవాడు కూడ ఈయనయే. బసవ పురాణము, పండితారాధ్య చరిత్రయను ద్విపద కావ్యములు ఇతని రచనలలో గొప్పవి.

## వేములవాడ భీమకవి

క్రీ.శ. ౧౨వ శతాబ్దికి చెందినవాడు. ఇతడు తిట్టుకవి. రాఘవ పాండవీయము రచించెనని చెప్పుదురు కాని ఆ గ్రంథము లభించలేదు. భీమన ఛందమను ప్రసిద్ధిగల కవిజనాశ్రయము నీతడు రచించెను.

## భాస్కరుడు

క్రీ.శ. ౧౨ - ౧౩ వ శతాబ్దులకు చెందినవాడు. తిక్కన తాతయగు నీతడు రామాయణమును వ్రాసెను. ఇది తర్వాత కొంత శిథిలమగుటచే హుళక్కిభాస్కరాదులు పూర్తి చేసిరి. దీనినే భాస్కర రామాయణమందురు.

## గోనబుద్ధారెడ్డి (రంగనాథుడు)

క్రీ.శ. ౧౩వ శతాబ్దికి చెందినవాడు. రామాయణమును ద్విపదలో రచించెను. ఇది తొలిద్విపద రామాయణ గ్రంథము. ఈ గ్రంథము సులభశైలిలో వ్రాయబడి మిక్కిలి ప్రచారముగలదై యున్నది.

## శ్రీనాథుడు

క్రీ.శ. ౧౪ - ౧౫ వ శతాబ్దులకు చెందినవాడు. రెడ్డిరాజుల యాస్థాన కవియై కవిసార్వభౌముడను బిరుదము గాంచి యనేక గ్రంథరాజములను రచించినవాడు. శృంగార నైషధము, కాశీఖండము, భీమ ఖండము, హరవిలాసము మున్నగునవి యితని ప్రసిద్ధ కృతులు. దేశసంచారము చేసి యనేక రాజుల దర్శించి కనకాభిషేకాది సత్కారములగాంచెను. ఇతని చాటు పద్యములసంఖ్యాకములు, బహు రసవంతములు. బమ్మెర పోతనకు సమకాలీనుడు.

## బమ్మెర పోతన

క్రీ.శ. ౧౪ - ౧౫ వ శతాబ్దులకు చెందినవాడు. మహాభక్తుడు, మహాకవి. మధుర మంజుల శైలిలో భక్తిరసమయముగ దివ్యముగా ఆంధ్ర మహాభాగవతమును రచించెను. ఇది యావదాంధ్రుల ప్రీతిపాత్రమైనది. ఇతనికి పేరుప్రతిష్ఠలు ఇహము పరము నిచ్చినదిగా ప్రసిద్ధిగన్న శ్రీమదాంధ్ర మహాభాగవతమునకు ఉన్న ప్రచారము ఇతర ఏ గ్రంథమునకును లేదు. పోతన వీరభద్ర విజయమును, భోగినీ దండకమును, నారాయణ శతకమును గూడ రచించెను.

## వేమన

క్రీ.శ. ౧౫ వ శతాబ్దికి చెందినవాడు. 'విశ్వదాభిరామ వినురవేమ' యను మకుటముగల పద్యములు వేలకొలది చెప్పెను. ఇతడు ప్రజాకవి. యోగి.

## తాళ్ళపాక అన్నమాచార్యుడు

క్రీ.శ. ౧౬ వ శతాబ్దికి చెందినవాడు. మహాభక్తుడు. సంకీర్తనాచార్యుడు. పదకవితాపితామహుడన్న బిరుదముగన్నవాడు. తిరుపతి శ్రీ పద్మావతీ వేఙ్కటేశ్వరస్వామిపై వేలకొలది సంకీర్తనములు రచించెను. వానికి అన్నమాచార్య కీర్తనలని పేరు.

## శ్రీకృష్ణ దేవరాయలు

క్రీ.శ. ౧౬ వ శతాబ్దికి చెందినవాడు. దక్షిణ భారతదేశమునంతయు పరిపాలించిన మహారాజు. సంస్కృతాంధ్రములందు మహాకవియై యష్టదిగ్గజ కవులను బోషించి ఆంధ్రభోజుడను బిరుదము గాంచినవాడు. భగవంతుని ప్రేరణచే తెలుగున ఆముక్తమాల్యద యను ప్రబంధమును రచించెను.

### అల్లసాని పెద్దన

మనుచరిత్రమను ప్రబంధమును రచించి కృష్ణదేవరాయల కంకితము చేసెను. రాయలచేత గండపెండేర సత్కారమును బడసెను. ఆంధ్ర కవితా పితామహుడని యీతని బిరుదము.

### నంది తిమ్మన

పారిజాతాపహరణమను రచించెను.

### యాదగిరి మల్లన

రాజశేఖర చరిత్రమును వ్రాసెను.

### ధూర్జటి

శ్రీకాళహస్తీశ్వర మహాత్మ్యమును మఱియు శ్రీకాళహస్తీశ్వర శతకమును వ్రాసెను.

### అయ్యలరాజు రామభద్రుడు

రామాభ్యుదయమును రచించెను.

### పింగళి సూరన

రాఘవ పాండవీయము, కళాపూర్ణోదయము, ప్రభావతీ ప్రద్యుమ్నము మున్నగు మహాకావ్యములను రచించెన మహాకవి.

### రామరాజభూషణుడు

భట్టుమూర్తి యని యితని నామాంతరము. వసు చరిత్ర, హరిశ్చంద్ర నలోపాఖ్యానములను, నరస భూపాలీయమను నామాంతరముగల కవ్యాలంకార సంగ్రహమును లక్షణ గ్రంథములను రచించెను.

### తెనాలి రామకృష్ణుడు

పాండురంగ మహాత్మ్యము, ఘటికాచల మహాత్మ్యము, ఉద్భాటారాధ్య చరిత్రము అను గొప్ప కావ్యములను రచించెను. ఇతడు వికటకవి. ఇతని చాటువులు పెక్కు.

### ఆతుకూరి మొల్ల

క్రీ.శ. ౧౬ వ శతాబ్దికి చెందినది. ఈమె ఆమె పేరుతోనే మొల్లరామాయణమను చిన్న పద్య కావ్యముగ రచించి శ్రీరామునికే అంకితము చేసికొని తన జీవితమును కవితను సార్థకముగావించుకొని ధన్యురాలైన కవయిత్రి.

### తరిగొండ వెంకమ్మ

క్రీ.శ. ౧౮ వ శతాబ్దికి చెందినది. వేఙ్కటాచల మహాత్మ్యమును రచించిన భక్త కవయిత్రి. ఈమె ఇంకను పెక్కు కృతులు రచించెను.

### త్యాగయ్య

క్రీ.శ. ౧౮ వ శతాబ్దికి చెందినవాడు. సుప్రసిద్ధ గాయక చక్రవర్తి. గొప్ప రామభక్తుడు. వందలకొలది కృతులు రచించెను.

## చిన్నయ సూరి

క్రీ.శ. ౧౯ వ శతాబ్దికి చెందినవాడు. నీతి చంద్రికను రచించి వచన రచనకు చక్కని మార్గమును చూపినవాడు. తెలుగున మొదటి గద్యకవిఐనాడు. ఇతని బాలవ్యాకరణము తెలుగు భాషకు పరమ ప్రామాణికమైన యెల్లర కవశ్యపఠనీయమై యున్నది.

## కందుకూరి వీరేశలింగం పంతులు

౧౮౪౮ నుండి ౧౯౧౯ ఈతని కాలము. నాటి వాఙ్మయ వికాసమునకు మార్గదర్శకుడు. నాటకము, నవల, ప్రహసనము, కథ, వ్యాసము, విమర్శ, స్వీయచరిత్రము మున్నగు వివిధ సాహిత్య ప్రక్రియలను తెనుగున ప్రవేశపెట్టినాడు. ఇతని రచనలలో ఆంధ్రకవుల చరిత్ర ఆనాటి కాలమున సుప్రసిద్ధమయినది. అంతేకాక మేటి సంఘసంస్కర్త. నవయుగభానుడని ప్రఖ్యాతిగాంచెను. గద్యతిక్కన బిరుదాంకితులు.

## శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి

౧౮౬౬ నుండి ౧౯౬౧ ఈతని కాలము. ప్రాచీన మార్గములో కవిత చెప్పిన ఆధునిక మహాకవులలో మొదటివారు. ఆంధ్రప్రభుత్వ మొదటి ఆస్థానకవి. శతాధిక గ్రంథకర్తలు. భారత, భాగవత, రామాయణములను ఒక్కచేతిమీదుగా ఆంధ్రీకరించిన అసమాన్య ప్రజ్ఞాశాలి. కవిసార్వభౌమ బిరుదాంకితులు. కనకాభిషేక గౌరవమును, కవిగండపెండేరమును అలంకరించి తెలుగుసాహితికి అలంకారముగా భాసిల్లినారు.

## తిరుపతి వేఙ్కటకవులు

దివాకర్ల తిరుపతిశాస్త్రి (౧౮౭౧ నుండి ౧౯౧౯ వరకు), చెళ్ళపిళ్ళ వేఙ్కటశాస్త్రి (౧౮౭౦ నుండి ౧౯౫౦ వరకు) అను ఇరువురు తిరుపతి వేఙ్కటకవులుగా తమ జంట కవిత్వముద్వారా తెలుగు సాహిత్యములో సుప్రసిద్ధిలయినారు. ఆంధ్రకవిత్వమును రాజప్రాసాదములనుండి ప్రజల ముంగిళ్ళ వద్దకు తీసుకువచ్చిన ధీశాలురు. తమ అష్టావధాన, శతావధాన, అశుకవిత్వాది ప్రక్రియలద్వారా శ్రీనాథుని తరువాత తెలుగు సాహితికి విశేష వ్యాప్తిని కల్గించినవారు. సంభాషణరీతిలో పద్యాలను చెప్పి పద్య కవిత్వ సారళ్యాన్ని ప్రజలకు తెలియజేసి సామాన్య తెలుగు ప్రజలకు కూడా పద్యాలపై ఆసక్తిని కల్పించినవారు. వీరి పద్యాలురాని తెలుగువాడు ఆనాటి కాలములోనేమి నేటికాలములో కూడా లేరంటే అతిశయోక్తికాదు.

## వేఙ్కట పార్వతీశ్వరకవులు

బాలాంత్రపు వేఙ్కటరావు (౧౮౮౦ నుండి ౧౯౭౨ వరకు), ఓలేటి పార్వతీశం (౧౮౬౨ నుండి ౧౯౧౫ వరకు) ఇరువురు వేఙ్కటపార్వతీశ్వర కవులుగా ప్రసిద్ధి చెందారు. ఏకాంతసేవ, భావసంకీర్తనము, కావ్యకుసుమావళి వీరి రచనలు. ఇందలి ఏకాంతసేవ తెలుగు గీతాంజలిగా ప్రఖ్యాతిగాంచినది.

## గురజాడ వేఙ్కట అప్పారావు

౧౮౬౨ నుండి ౧౯౧౫ ఈతని కాలము. ఆధునిక తెలుగు సాహితీ లోకములో సరిక్రొత్త విప్లవాన్ని మేల్కొల్పిన మేరునగధీరుడు, నవయుగవైతాళికుడు. కన్యాశుల్కాలు నాటకము, ముత్యాలసరాలు, నీలగిరి పాటలు, పూర్ణమ్మ, తోకచుక్క, డామన్ పిథియస్, లవణరాజు కల మున్నగునవి ఈయన రచనలు. "దేశమంటే మట్టికాదోయ్ దేశమంటే మనుషులోయ్" అంటూ తెలుగుజాతి జాగృతము చేసిన మానవతావాది.

## రాయప్రోలు సుబ్బారావు

౧౮౯౨ నుండి ౧౯౮౪ ఈతని కాలము. గురజాడ కవిత్వముతో మేల్కొన్న తెలుగు కవులకు సరైన దిశ చూపించి వారి గొంతుకలలో కులకూజితములు పలికించిన అభినవాంధ్ర యుగకర్త రాయప్రోలు. కోకిలస్వామి బిరుదాంకితులు. రమ్యాలోకము, మాధురీ దర్శనము, తృణకంకణము, కష్టకమల, ఆంధ్రావళి, లలిత, అనుమతి, స్నేహలత, మధుకరము మున్నగునవి వీరి ముఖ్య రచనలు. అమలిన శృంగారము అను నూత్న సిద్ధాంత ప్రవక్త. 'ఏ దేశమేగినా ఎందుకాలిడినా ఏ పీఠమెక్కినా ఎవ్వరేమనిన పొగడరా నీతల్లి భూమి భారతిని నిలుపరా జీ జాతి నిండు గౌరవము' అంటూ తెలుగువారి జాతీయ భావమును, ఆత్మ గౌరవమును తట్టిలేపిన మహనీయుడు. భావకవిత్వ ముఖ్యలక్షణమైన ఆత్మాశ్రయ ధోరణిలో అచనచేసి భావి కవిత్వమునకు మూలపురుషుడుగా పరిగణింపబడ్డారు.

## దేవులపల్లి వేఙ్కట కృష్ణశాస్త్రి

౧౮౯౭ నుండి ౧౯౮౦ ఈతని కాలము. అచ్చమైన భావకవి. తెలుగునేల నలుచెరగులా  భావకవిత్వమును ఒక మహోద్యమముగా వ్యాపింపజేసి, దానికి స్థిరత్వమును కల్పించినారు.కృష్ణపక్షము, ప్రవాసము, ఊర్వశి, హృదయేశ్వరి మున్నగునవి వీరి రచనలు.

## విశ్వనాథ సత్యనారాయణ

౧౮౯౫ నుండి ౧౯౭౬ ఈతని కాలము. తొలి తెలుగు జ్ఞానపీఠ బహుమతి గ్రహీత. మొదట భావకవి తరువాత నవ్య సంప్రదాయ కవి. భ్రష్టయోగి, ఆంధ్ర పౌరుషము, గిరి కుమారుని ప్రేమగీతాలు, ఆంధ్ర ప్శస్తి, వరలక్ష్మీ త్రిశతి మున్నగునవి ఈయన భావకవితా సంపుటులు. వేయిపడగలు నవల కేంద్ర సాహిత్య అకాడమీ బహుమతిని మొందిన అద్భుత నవల. ఇది భారత మాజీ ప్రధానమంత్రి శ్రీ పి. వి. నరసింహారావు సహస్రఫణ్ పేరున హిందీలోకి అనువదించినారు. వీరి శ్రీమద్రామాయణ కల్పవృక్షము మన రాష్ట్రములో విశేష ఆదరణ పొందుటయే కాక జ్ఞానపీఠ బహుమతిని కూడ పొందినది. తెలుగు సాహిత్య రంగములో వీరు చేపట్టిన ప్రక్రియ లేదు. కవిసామ్రాట్ బిరుదాంకితులు. చెళ్ళపిళ్ళ వేఙ్కటశాస్త్రిగారి తరువాత అంత ప్రఖ్యాతిగాంచిన ఆయన శిష్యాగ్రేసరుడు. ఆయన కిన్నెరసాని పాటలు తెలుగు సాహిత్యములో రసవత్కావ్యము.

## నండూరి సుబ్బారావు

౧౮౯౫ నుండి ౧౯౫౭ ఈతని కాలము. ఎంకి పాటలతో తెలుగు సాహితీ లోకములో పెద్ద దుమారాన్ని లేవదీసిన భావకవి. చూపుతో మాటాడి ఊపిరితో తెనిగించిన అచ్చమైన తెలుగుకవి. తూర్పుకాపువారి యాసతో జానపదగేయ పద్ధతిలో, దేశియమైన పలుకుబడితో రచింపబడిన వీరి ఎంకి పాటలు తెలుగు ప్రజల హృదయాలను రసప్లావితము గావించాయి. 'గొండె గొంతుకలోన కొట్లాడుతాది కూకుండనీదురా కూసింతసేపు' అంటూ తెలుగు సాహితీ లోకములో అవతరించిన నండూరి వారి ఎంకి తెలుగు ప్రజల నాలుకలపై నిలిచిపోయినది.

## గుఱ్ఱం జాషువా

౧౮౯౫ నుండి ౧౯౭౧ ఈతని కాలము. భావ కవిత్వములో అంతర్లీనమయిన ఖండకావ్య ప్రక్రియకు వన్నె తెచ్చిన కవి జాషువా. హిమ ధర్మార్క పరిణయము, శివాజీ, ఫిరదౌసి, స్వప్న కథ, గబ్బిలము, కాందిశీకులు, నేతాజీ, బాపూజీ, క్రొత్త లోకము, ముంతాజుమహల్, మూసాఫరులు, రాష్ట్రపూజ, నా కథ మొదలుగునవి ఈయన కృతులు. ఛందోబద్ధ సంప్రదాయ పరంపరలో పద్యరచనగావించిన ఈయన భావనలో ఆధునికుడు.

## రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మ

జననము ౧౮౯౩. కవిగాకన్న విమర్శకుడిగా తెలుగు సాహితీ లోకమునకు సుపరిచితులు. గాథాసప్తశతి, పరివర్తనము, పెనుగొండ వీరి కవితలు. రాయలనాటి రసికత, వేమన, సారస్వతాలోకము, నాటకోపన్యాసములు మొదలైన వీరి విమర్శ వ్యాసములు తెలుగు సాహిత్య విమర్శను సుసంపన్నము చేసాయి.

## పుట్టపర్తి నారాయణాచార్యులు

జననము ౧౯౧౪. శతాధిక గ్రంథకర్త. బహుభాషావేత్త. సరస్వతీపుత్ర, మహాకవి, పద్మశ్రీ బిరుదాంకితులు. సంప్రదాయ కవిత్వములో పుట్టి, భావకవిగా పెరిగి, అభ్యుదయమువైపు దృష్టిసారించిన కవి, సద్విమర్శకుడు. పెనుగొండ లక్ష్మి, సాక్షాత్కారము, సాధ్యము, శివతాండవము, మేఘదూతము, అగ్నివీణ, షాజీ, గాంధీ మహాప్రస్థానము, జనప్రియ రామాయణము, పండరీ భాగవతము, శ్రీనివాస ప్రబంధము మొదలైనవి వీరి రచనలు.

## జంధ్యాల పాపయ్యశాస్త్రి

జననము ౧౯౧౨. కరుణశ్రీ అను వారి కలం పేరుతో వారు సుప్రసిద్ధులు. ఉదయశ్రీ, కరుణశ్రీ, విజయశ్రీ సంపుటములుగా భావకవితా స్ఫూర్తితో ఖండ కావ్యములను వెలయించారు.

ॐ

## శ్లోకములు - ౧

వక్రతుణ్డ మహాకాయ సూర్యకోటిసమప్రభా ।
నిర్విఘ్నం కురు మే దేవ సర్వకార్యేషు సర్వదా ॥

---

యా కున్దేన్దు తుషార హార ధవళా యా శుభ్రవస్త్రాన్వితా ।
యా వీణావరదణ్డ మణ్డితకరా యా శ్వేతపద్మాసనా ।
యా బ్రహ్మాచ్యుతశఙ్కరప్రభృతిభిర్దేవై సదా పూజితా ।
సా మాం పాతు సరస్వతి భగవతీ నిఃశేష జాడ్యా పహా ॥

---

గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః ।
గురుః సాక్షాత్పరబ్రహ్మా తస్మై శ్రీ గురవేనమః ॥

---

కరాగ్రే వసతే లక్ష్మీః కరమధ్యే సరస్వతీ ।
కరమూలే తు గోవిన్దః ప్రభాతే కరదర్శనమ్ ॥

---

సముద్రవసనే దేవి పర్వతస్తనమణ్డలే ।
విష్ణుపత్ని నమస్తుభ్యం పాదస్పర్శ క్షమస్వ మే ॥

---

శాన్తాకారం భుజగశయనం పద్మనాభం సురేశం
విశ్వాధారం గగనసదృశం మేఘవర్ణం శుభాఙ్గమ్ ।
లక్ష్మీకాన్తం కమలనయనం యోగిభిర్ధ్యానగమ్యం
వన్దే విష్ణుం భవభయహరం సర్వలోకైకనాథం ॥

---

సర్వేఽపి సుఖినః సన్తు సర్వే సన్తు నిరామయాః ।
సర్వే భద్రాణి పశ్యన్తు మా కశ్చిద్దుఃఖభాగ్భవేత్ ॥

---

యా దేవీ సర్వభూతేషు మాతృరూపేణ సంస్థితః ।
యా దేవీ సర్వభూతేషు శక్తిరూపేషు సంస్థితః ।
యా దేవీ సర్వభూతేషు శాన్తిరూపేణ సంస్థితః ।
నమస్తస్యైః నమస్తస్యైః నమస్తస్యైః నమో నమః ॥

---

సర్వ మఙ్గళ మాఙ్గళ్యే శివే సర్వార్థ సాధికే
శరణ్యే త్ర్యమ్బకే గౌరీ నారాయణీ నమోస్తుతే ॥

---

వసుదేవ సుతం దేవం కంస చాణూరమర్దనం
దేవకీ పరమానన్దం కృష్ణం వన్దే జగద్గురుమ్ ॥

బ్రహ్మార్పణం బ్రహ్మ హవిః బ్రహ్మాగ్నౌ బ్రహ్మణాహుతమ్ ।
బ్రహ్మైవ తేన గన్తవ్యం బ్రహ్మకర్మసమాధినా ॥

శ్రీరామ రామ రామేతి రమే రామే మనోరమే
సహస్రనామ తత్తుల్యం రామనామ వరాననే ॥

శుభం కరోతి కళ్యాణం ఆరోగ్యం ధనసమ్పదా
శత్రుబుద్ధివినాశాయ దీపజ్యోతి నమోఽస్తుతే ॥

కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచనా
మా కర్మఫలహేతుర్భూః మా తే సఙ్గోస్త్వ కర్మణి ॥

కరచరణ కృతం వాక్కాయజం కర్మజం వా
శ్రవణనయనజం వా మానసం వాపరాధం ।
విహితమవిహితం వా సర్వమేతత్క్షమస్వ
జయ జయ కరుణాబ్ధే శ్రీమహాదేవ శమ్భో ॥

ఓం సహ నావవతు । సహ నౌ భునక్తు ।
సహ వీర్యం కరవావహై ।
తేజస్వి నావధీతమస్తు । మా విద్విషావహై ॥

త్వమేవ మాతా చ పితా త్వమేవ
త్వమేవ బన్ధుశ్చ సఖా త్వమేవ ।
త్వమేవ విద్యా ద్రవిణం త్వమేవ
త్వమేవ సర్వం మమ దేవ దేవ ॥

అసతో మా సద్గమయ । తమసో మా జ్యోతిర్గమయ ।
మృత్యోర్మా అమృతం గమయ ॥
ఓం శాంతిః శాంతిః శాంతిః ॥

ఓం పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్ పూర్ణమ్ముదచ్యతే ।
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే ॥

ఓం శాంతిః శాంతిః శాంతిః ॥

ॐ

## శ్లోకములు - ౨

సరస్వతీ నమస్తుభ్యం వరదే కామరూపిణి ।
విద్యారమ్భం కరిష్యామి సిద్ధిర్భవతు మే సదా ॥

---

ఆకాశాత్ పతితం తోయం యథా గచ్ఛతి సాగరమ్ ।
సర్వదేవనమస్కారాన్ కేశవం ప్రతిగచ్ఛతి ॥

---

దీపజ్యోతిః పరబ్రహ్మ దీపర్జ్యోతిర్జనార్దనః ।
దీపో హరతు మే పాపం దీపజ్యోతిర్నమోఽస్తుతే ॥

---

గణనాథసరస్వతీరవిశుక్రబృహస్పతీన్ ।
పఞ్చైతాన్ సంస్మరేన్నిత్యం వేదవాణీప్రవృత్తయే ।

---

సుముఖశ్చ యేకదన్తశ్చ కపిలో గజకర్ణకః ।
లమ్బోదరశ్చ వికటో విఘ్ననాశో గణాధిపః ॥
ధూమకేతుర్గణాధ్యక్షో ఫాలచన్ద్రో గజాననః ।
ద్వాదశైతాని నామాని యః పఠేచ్ఛృణుయాదపి ॥
విద్యారంభే వివాహే చ ప్రవేశే నిర్గమే తథా ।
సఙ్గ్రామే సఙ్కటే చైవ విఘ్నస్తస్య నజాయతే ॥

---

శుక్లామ్బరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్ ।
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాన్తయే ॥

---

సర్వదా సర్వకార్యేషు నాస్తి తేషామమఙ్గళమ్ ।
యేషం హృదిస్థో భగవాన్ మఙ్గళాయతనం హరిః ॥

---

తదేవ లగ్నం సుదినం తదేవ తారాబలం చన్ద్రబలం తదేవ ।
విద్యాబలం దేవబలం తదేవ లక్ష్మీపతే తేఽఙ్ఘ్రియుగం స్మరామి ॥

---

కాయేన వాచా మనసేన్ద్రియైర్వా బుద్ధ్యాత్మనా వా ప్రకృతేః స్వభావాత్ ।
కరోమి యద్యద్ సకలం పరస్మై నారాయణాయేతి సమర్పయామి ॥

---

హరిర్దాతా హరిర్భోక్తా హరిరన్నం ప్రజాపతిః ।
హరిః సర్వః శరీరస్థో భుఙ్క్తే భోజయతే హరిః ॥

---

కర్పూరగౌరం కరుణావతారం సంసారసారం భుజగేన్ద్రహారమ్ ।
సదా వసన్తం హృదయారవిన్దే భవం భవానీసహితం నమామి ॥

### శ్రీరామాయణసూత్ర

ఆదౌ రామతపోవనాదిగమనం హత్వా మృగం కాఞ్చనమ్
వైదేహీహరణం జటాయుమరణమ్ సుగ్రీవసంభాషణమ్ ॥
వాలీనిర్దలనం సముద్రతరణం లఙ్కాపురీదహనమ్
పశ్చాద్రావణకుమ్భకర్ణహననం యేతద్ధిరామాయణమ్ ॥

### శ్రీభాగవతసూత్ర

ఆదౌ దేవకిదేవిగర్భజననం గోపీగృహే వర్ధనమ్
మాయాపూతనజీవితాపహరణం గోవర్ధనోద్ధారణమ్ ॥
కంసచ్ఛేదనకౌరవాదిహననం కున్తీసుతాం పాలనమ్
ఏతద్భాగవతం పురాణకథినం శ్రీకృష్ణలీలామృతమ్ ॥

### గీతాస్తవ

పార్థాయ ప్రతిబోధితాం భగవతా నారాయణేన స్వయమ్
వ్యాసేనగ్రథితాం పురాణమునినా మధ్యే మహాభారతే
అద్వైతామృతవర్షిణీం భగవతీమష్టాదశాధ్యాయినీమ్
అమ్బ త్వా మనుసన్దధామి భగవద్గీతే భవేద్వేషిణీమ్ ॥

సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాలనన్దనః ।
పార్థో వస్యః సుధీర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్ ॥

### వ్యాసస్తుతీ

నమోస్తు తే వ్యాస విశాలబుద్ధే ఫుల్లారవిన్దాయతపత్రనేత్ర ।
యేన త్వయా భారతతైలపూర్ణః ప్రజ్వాలితో జ్ఞానమయప్రదీపః ॥
వ్యాసాయ విష్ణురూపాయ వ్యాసరూపాయ విష్ణవే ।
నమోవై బ్రహ్మనిధయే వాసిష్ఠాయ నమోనమః ॥

## శ్రీదత్తగురుధ్యానమ్

బ్రహ్మానన్ద పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం
ద్వంద్వాతీతం గగనసదృశం తత్త్వమస్యాదిలక్ష్యమ్ |
ఏకం నిత్యం విమలమచలం సర్వధీసాక్షిభూతం
భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తం నమామి ||

---

యం బ్రహ్మావరుణేన్ద్రరుద్రమరుతః స్తువన్తి దివ్యైః స్తవైః
వేదైః సాఙ్గపదక్రమోపనిషదైః గాయన్తి యం సామగాః |
ధ్యానావస్థితతద్గతేన మనసా పశ్యన్తి యం యోగినో
యస్యాన్తం న విదుః సురాసురగణా దేవాయ తస్మై నమః ||

---

మూకం కరోతి వాచాలం పఙ్గు లఙ్ఘయతే గిరిమ్ |
యత్కృపా తమహం వన్దే పరమానన్దమాధవమ్ ||

---

## దేవతావన్దనమ్

శ్రీమన్మహాగణాధిపతయే నమః |
శ్రీ సరస్వత్యై నమః | శ్రీగురవే నమః |
శ్రీమాతాపితృభ్యాం నమః |
శ్రీలక్ష్మీనారాయణాభ్యాం నమః |
శ్రీఉమామహేశ్వరాభ్యాం నమః |
ఇష్టదేవతాభ్యాం నమః | కులదేవతాభ్యో నమః |
స్థానదేవతాభ్యో నమః | వాస్తుదేవతాభ్యాం నమః |
సర్వేభ్యో దేవేభ్యో నమో నమః ||
అవిఘ్నమస్తు ||

---

|| ఓం తత్సత్ ఇతి ||

ॐ

## భక్తి పద్యములు

తుండము నేకదంతమును తోరపు బొజ్జయు వామహస్తమున్
మెండుగ మ్రోయు గజ్జెలును మెల్లని చూపులు మందహాసమున్
కొండొక గుజ్జు రూపమున కోరిన విద్యలకెల్ల నొజ్జవై
యుండెడి పార్వతీ తనయ యోయి గణాధిప నీకు మ్రొక్కెదన

తలచితి నే గణనాథుని
తలచితి నే విఘ్నపతిని
తలచిన పనిగ తలచితి నే హేరంబుని
తలచితి మా విఘ్నములను తొలగించుటకున్

అటుకులు కొబ్బరిపలుకులు
చిటిబెల్లము నానుబ్రాలు చెఱకు రసంబున్
నిటలాక్షునగ్ర సుతునకు
బటుతరముగ విందు సేతు ప్రార్థింతు మదిన్

తల్లీ నిన్ను దలంచి పుస్తకము చేతన బూనితిన్ నీవు నా
యుల్లంబందున నిల్చి జృంభణముగా నుక్తుల్ సుశబ్దంబు శో
భిల్లం బల్కుము నాదు వాక్కునను సంప్రీతిన జగన్మోహినీ
ఫుల్లాబ్జాక్షి సరస్వతీ భగవతీ పూర్ణేందు బింబాననా

చేత వెన్నముద్ద చెంగల్వ పూదండ
బంగారు మ్రొలత్రాడు పట్టుదట్టి
సందెదాయతులు సరిమువ్వ గజ్జెలు
చిన్నికృష్ణా నిన్ను చేరి కొలతు